శ్రీ

# స్పృశ్యాస్పృశ్య వివేకము

అను

## సనాతన ధర్మ ప్రచారము.

ఇది

పశ్చిమ గోదావరి మండలస్థిత ఏలూరు పట్టణ నివాసస్థులు,
పశ్చిమ గోదావరిజిల్లా వర్ణాశ్రమ ధర్మోద్ధారక సంఘసభ్యులు నగు

బ్రహ్మశ్రీ

## కలపర్తి వెంకట కృష్ణశర్మ పాకయాజి

విరచితము.



ఏలూరు, పట్టాభిరామా ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడియె.

నవంబరు, 1934.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

 [వెల రు **0-8-0**



ఈగ్రంధములు వలయువారు:—

ఈ దిగువనున్న చిరునామాకు వ్రాయుడు.

వి. పి. ఖర్చులు కొనువారే భరించవలెను.

వక్కసారిగా పది ప్రతులు కోరువారికి రు 4-0-0 లకే పంపబడును.

సనాతనధర్మ ప్రచారముకొరకు స్వల్పఖరీదు వేయబడినది.

చిరునామా:—

బ్రహ్మశ్రీ

కలపర్తి వెంకట కృష్ణశర్మ పాకయాజిగారు,

పవరుపేట-ఏలూరు.

పశ్చిమ గోదావరి జిల్లా.



శ్రీ మహాగణపతయేనమః.

# గ్రంథపీఠిక.

సనాతన ధర్మాభిలాషులైన మహాజనులారా !

నేను మొదటినుండియు సనాతనధర్మాసక్తి గలవాడ నగుటచే పశ్చిమ గోదావరీజిల్లా వర్ణాశ్రమ ధర్మోద్ధారక సంఘ సభ్యునిగా ది 17-12-33 సం॥రం తారీఖున ప్రవేశించు ప్రసక్తికలిగినది. అంతటి నుంచి అప్పుడప్పుడు జరుగు సభలలో పండితులచే సనాతనధర్మబోధలు జరుపబడుచుండెను. సనాతన ధర్మములన్నియు శ్రుతి, స్మృతి, పురాణాదులయందుండువాటిని అందరును సులభముగా గ్రహించ సాధ్యములు గానందున వివిధ గ్రంథాభిప్రాయములను క్రోడీకరించి వాటినన్నిటిని అందరికి సుబోధముగా చేయవలయునను తలంపుతోనుండి అల్పజ్ఞుడనైన నేను యీపనికి పూనుకొనుట అశక్యమని యెరిగియున్నప్పటికి సనాతనధర్మ నిర్మూలమగుచుండుటను సహించలేక యథాశక్తిగా విమర్శించి స్పృశ్యాస్పృశ్య వివేకము అను సనాతనధర్మ ప్రచారము అను పేరుతో దీనిని రచించియున్నాను. యిది కొంతవరకైనను సనాతనధర్మ బోధకు సహకారియగునని నాతలంపు. ఈ వ్యాసమును అఖిల భారతవర్షీయ దేవాలయ సంరక్షక దినమందు ది 6—5—34 తేదీని యేలూరులో సాహిత్యవిశారద బ్ర॥ కోన వెంకటాద్రియశర్మగా రధ్యక్షతవహించిన సభలో ఉపన్యసించబడి ప్రశంసించబడెను. పిమ్మట యేలూరులో ఆ 1934 సం॥రం మే నెల 25, 26 తేదిలను జరిగిన అఖిలాంధ్రరాష్ట్ర వర్ణాశ్రమ ధర్మోద్ధారక సభవారిని సనాతనధర్మ ప్రచారార్థము దీనిని ప్రకటించుటకు కోరబడినది. ఆ సభవారు దీనిని ముద్రించుట కుపేక్షించినందున నేను పత్రికాప్రచారము చేయుచుంటిని. దానిని చదివిచూచిన కొందరు పండితులున్నూ మిత్రబృందమున్నూ

దీనిని గ్రంథరూపముగా ప్రచురించిన యెడల సనాతనులకు మిక్కిలి ఉపయోగకరముగను సనాతనధర్మ మార్గదర్శిగనున్నూ ఉండునని నాతో ప్రత్యక్షముగను జాబులమూలముగను తెల్పియున్నారు. అట్టి వారిలో ముఖ్యుడగు శ్రీవేదమూర్తులైన బ్రహ్మశ్రీ ద్వైతాద్వైతమతస్థాపకులగు శ్రీకోటేశ్వరదీక్షితులవారు శ్రీభావ సం॥రం కార్తీక శుద్ధనవమీ గురువారం ది 15-11-34 తేదీని కృష్ణాజిల్లా కైకలూరు గ్రామంలో జరుపబడుటకు నిశ్చయించిన శ్రీచిదానంద సరస్వతీయతీంద్రుల (పూర్వాశ్రమము వేద వేదాంగవేత్తయైన బ్రహ్మశ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులు) వారి అరువది వక్కటవ ఆరాధన సందర్భములో జగత్ప్రతిష్ఠిత సభలో సనాతన ధర్మప్రచారార్థము దీనిని గ్రంథరూపముగా ముద్రించ ప్రోత్సహించినందున ముద్రించు ప్రసక్తికలిగినది. ఈ గ్రంథములో సర్వజనులు జననాది మరణ పర్యంతము సర్వకాలములయందును అపవిత్రపదార్థ స్పర్శాది నిషేధపూర్వకముగా సర్వేంద్రియముల ద్వారా తమతమ శరీరములను పవిత్రము చేయుచుండుట మూలాముగా సాత్త్విక తేజోశక్తిని వృద్ధిచేసుకొనుచుండుటయే సనాతన ధర్మనిర్ణయమనియును అందువలన పొందు ప్రయోజనమున్నూ వివరించబడియున్నది. మరియు సర్వజనులు ముఖ్యముగా ఆచరించి పవిత్రులై ఉత్తమపదవి నందదగిన సనాతన ధర్మములన్నియు సాధ్యమయినంతవరకును సూక్ష్మముగా దీనిలో సంగ్రహించబడినవి. యజ్ఞములు జాతరలందు పశువధను గురించియు చర్చించబడినది. సనాతన ధర్మములన్నియు అవశ్యముచే పూర్తిగా ఆచరించలేకపోయి నప్పటికి వాటియందు విముఖత్వము వహించక పూర్తి నమ్మకము గలిగియుండి యథాశక్తిగా ఆచరించువారందరు సనాతనులని భావించబడుదురు. దీనిలో శ్రుతి స్మృతి పురాణాదుల ననుసరించి వ్రాయబడినయే స్వల్ప హింశమును సగా నమ్మక యితరమతావేశముచే వర్తించుచు పిడివాదమును సిద్ధపడువారున్నూ పూర్వజన్మకర్మానుగుణ్యముగా బ్రహ్మ క్షత్రియ

వైశ్య శూద్ర చండాలాదులలోనున్ను యితర క్రిమికీటక తరుగుల్మల తాదులలోనున్నూ జన్మలున్నూ కష్టసుఖములున్నూ కలుగుచుండు నను నమ్మకములేని వారందరున్నూ సనాతనులుగా మొత్తమాత్రము భావించబడరు. దీని తరువాత నుదహరించబడిన సనాతన ధర్మ మూల మగు నిత్యకర్మలలో ద్విజాతులు వాడతగిన సంకల్పములో నిదగు దేశము, కాలము, కర్త యొక్క వివరము వలనగూడ సనాతన ధర్మ విషయము లనేకములు గ్రహించగలరు. ఒక్కొక్క విషయ మును గురించి సూక్ష్మాతి సూక్ష్మములగు విశేషాంశములున్నప్పటికి గ్రంథవిస్తరభీతిచే విరమించటమైనది. ఇందలి లోపములు పండితులు సహేతుకముగా తెల్పినయడల రెండవ ముద్రణములో సవరించుకొందును. తమ జీవితమును యోగ్యముగా నడపిననే ఉత్తమజన్మలుగాని మోక్షా ర్హతగాని కలుగునను నమ్మకముగలవారందరు ఈ గ్రంథము ఒక్కొక్క ప్రతిని వద్దనుంచుకొని పఠించుచుండిన విశేషాంశములు గ్రహించ గలరు. గనుక దీనిని పైపేరు చూచుటతోడనే నిరసించకనున్నూ, దీనిని చదువుటచేతను కొంతకాలహరణ మగునని తలంచకనున్నూ ఒక్కసారి యయినను నెమ్మదిగను శాంతముగను చదివిన్ని మీమిత్రు లకు జూపిన్ని గుణగ్రాహులగుదురుగాక యని విన్నవించుచున్నా వాడను.

ఇట్లు విన్నవించు సజ్జనవిధేయుడు,

పశ్చిమగోదావరి జిల్లా వర్ణాశ్రమ ధర్మోద్ధారక సంఘ సభ్యులు,

బ్రహ్మశ్రీ కలపత్రి వేంకట కృష్ణశర్మ పాకయాజి,

ఏలూరు.

శ్రీ వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః.

# గ్రంథ రచన దేశ కాలాది వివరం.

శ్లో॥ మహాసంకల్పజయస్య మహదాది ప్రవర్తనం। మహాపురుష ఏతస్మిన్ మహాసంకల్ప ఈరితః॥

శ్లో॥ కన్యాదానే నదీస్నానే తులాదానా దిషుద్విజః। ప్రాయశ్చిత్తేషు యజ్ఞాదౌ వ్రతాదిషు విశేషతః, శాంత్యాదిషు సర్వత్ర మహాసంకల్పమాదరాత్॥

సంకల్పము క్లుప్తవిధానం.

ఓం అస్య శ్రీ భగవతో మహాపురుషస్యా ద్యానంతవీర్యస్య శ్రీమదాది నారాయణస్యా చింత్యాపరిమిత మహిమా మహిత మాయా శక్త్యాభ్రియమాణస్య, మహాజలౌఘస్య మధ్యే పరిభ్రమమాణానాం, అనేకకోటిబ్రహ్మాండానా మేకతమే, అవ్యక్త మహదహంకారపృథివ్యాపస్తే జోవాయురాకాశైః సప్తావరణై రావృతేస్మిన్ మహతి బ్రహ్మాండఖండయోర్మధ్యే, పంచాశత్కోటియోజన విస్తీర్ణమహీమండలే లక్షయోజన విస్తీర్ణ జంబూద్వీపే, నవసహస్రయోజన విస్తీర్ణ భరతవర్షే, సహస్రయోజన విస్తీర్ణ భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్యేశాన్యప్రదేశే, కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే, పశ్చిమగోదావరీమండల హేలాపురిస్థితస్వగృహే సమస్తదేవతా గోబ్రాహ్మణ హరిహర చరణ సన్నిధౌ॥

గ్రంథరచనకాలము.

శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, సప్తమ జన్మని, పద్మజాపరనామక పరాఖ్యస్యాయుషోర్ధం పంచాశద్వత్సరే వ్యతీతేషు, ప్రథమే హ్నిద్వితీయయ్యే ప్రహరార్ధే, పంచమే శ్వేతవరాహకల్పే, పురందరాఖ్యేంద్రసహితసప్తమే వైవస్వత మన్వంతరే

నవమే బౌద్ధావతారే, ఇదానీం అష్టావింశన్మహాయుగే, ద్వాత్రింశత్సహ స్రాన్విత చెతుర్లక్షాబ్ద పరిమితకలౌయుగే, ప్రథమపాదే పంచ త్రింశోత్తర పంచసహస్రాబ్దే వర్తమాన తృతియ్యే శాలివాహన శకేషష్ఠపంచాష్ట శతోత్తర ఏకసహస్రాబ్దే అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్ర మానేన శ్రీ భావనామ సంవత్సరే దక్షిణాయనే శరదృతౌ కార్తీక మాసే శుక్లపక్షే ద్వితియాతిథౌ భార్గవవాసరే అనూరాధానక్షత్రే శుభయోగశుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ॥

## గ్రంథకర్త.

అనాద్య ఉ విద్యావాసన యాస్మిన్ సంసారే, విచిత్రాభిర్విచి త్రాసు యోనిషు, పునఃపునరనే కథాజనిత్వా కేన వాసుకర్మవిశేషేణ ఇదానీంమనుష్యేషు బ్రాహ్మణ జన్మసంప్రాప్తవతో, కశ్యపవంశేజాత స్య శ్రీమాన్ కాశ్యప సగోత్రః శ్రీ వేంకటకృష్ణశర్మనామధేయోహం శ్రీమతః కాశ్యపసగోత్రస్య శ్రీ వేంకటకృష్ణశర్మనామధేయస్యమమధర్మ పత్నీసమేతస్యమమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం సనాతన ధర్మప్రచారార్థం శ్రీస్మృత్యాస్మృత్యవివేకాఖ్య గ్రంథోయం మయా విరచితః॥

ఈ సంకల్పమును సంధ్యావందనాదినిత్య కర్మలలో వాడునప్పుడు కర్తయుండు దేశము అప్పటికాలము కర్తయొక్క కుల గోత్ర నామ ములు కర్మయొక్క వివరము మార్చుకొనుచుండవలెను.

శ్రీ ర స్తు.

# గ్రంథకర్త వంశాది వివరము.

శ్రీమదార్వేలనియోగి బ్రాహ్మణవంశ సంజాతులు శ్రీకాశ్యపస గోత్రులు యజుర్వేది తైత్తిరీయ శాఖాధ్యాయులు ఆపస్తంబ సూత్రులు, క్రమాంత వేదవేదాంగాధ్యయన వేత్తలు, యజనయాజనాది షట్కర్మనిరతులై తమ విద్యాప్రాముఖ్యతచేత ననేక మాన్యములు సంపాదించినట్టిన్ని వారి అంత్యకాలముకు సన్యసించి కేవల యోగనిష్ఠాగరిష్ఠులై ప్రత్యక్షముగా నేడు గడియలలో బ్రహ్మరంధ్రమును భేదించుకొని పరమపద మలంకరించినట్టిన్ని శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ కలపర్తి బ్రహ్మానంద యోగివర్యులగు మహాసీయుని వంశీకులమైయున్నాము. వారికి నాల్గవ పురుషుడైన శ్రీకలపర్తి వంశరాకాసుధాకర శ్రీరామ కరుణాకటాక్షవీక్షణాగ్రేసర బ్రహ్మశ్రీ జోగిరాజు శర్మ, ధర్మపత్ని శ్రీ గంగాంబగార్ల ఉభయతపోఫల జనిత జ్యేష్ఠపుత్రుడనున్నా, యజనాది షట్కర్మనిరతులైనట్టిన్ని మాకు సన్నిహితజ్ఞాతిత్వము కలిగినట్టిన్ని వేదవేదాంగాధ్యాపకులై శ్రీలోహితసగోత్రికులైన బ్రహ్మశ్రీ సాక్షిచెరుల బ్రహ్మవధానులుగార్కి వయోధికుడనిన్ని నిర్ధనుడనిన్ని తలంచక కేవల పారమార్థికచింతచే కన్యాదానము చేసియున్నట్టిన్ని శ్రీశివపంచాయతన ప్రతిష్ఠాపకులైనట్టిన్ని బ్రహ్మశ్రీ కలపర్తి సీతారామశాస్త్రి పాకయాజిగారి ప్రియశిష్యుడనున్నా అగు నేను కలపర్తి వేంకట కృష్ణశర్మ యని వ్యవహరించబడుచున్నాను.

శ్రీశాలివాహన శక సం॥ 1793 రముకు సరియైన గత ప్రజోత్పత్తినామ సం॥ర మాఘశుద్ధ షష్ఠీబుధవారం అశ్వినినక్షత్రచతుర్థపాద బృహస్పతియుక్త కర్కాటకలగ్నమందు, నామాతామహులైన బాల్యాదిసమస్తపురాణేతిహాసాదిసర్వశాస్త్రబోధకులైనట్టిన్ని శ్రీహారితస

గోత్రీకులైన బ్రహ్మశ్రీ మంత్రిప్రగ్గడ పుల్లయ్యశర్మగారి స్వగృహమందు ఏలూరులో నాజననముగా నున్నది. నాకు శ్రీ కౌండిన్యసగోత్రీకులైన బ్ర॥ చాట్రాతి వెంకట్రామయ్య భార్యా శ్రీ సౌభాగ్యవతియగు వెంకట సర్వలక్ష్మియను సోదరిన్ని విభక్త కనిష్ఠ సోదరుడై గతించిన శ్రీ వెంకట్రామయ్య అను శ్రీ రాములు కుమాళ్ళు వివాహితులైన 1. శ్రీ వెంకట జోగిరాజు 2. శ్రీ నరసింహము అనువారలున్నుకలరు. నాకు శ్రీ విక్రమ సం॥ రం మాఘ శుద్ధ పంచమీ స్థిరవారము ఉపనయనం అయినది. ఏలూరులో కొంతకాలము పురాణవిద్యాదులు అభ్యసించనైనది. శ్రీ సర్వధారి సం॥రం నిజచైత్ర శుద్ధ చతుర్దశీ బుధవారం రాత్రి ఘ 3 ౧గి॥ వి॥లకు వృశ్చికలగ్నమందు శ్రీ కాశ్యాది నిఖిల పుణ్యక్షేత్రములు పాదచారినై సేవించిన శ్రీ భారద్వాజ సగోత్రీకులైన బ్రహ్మశ్రీ గోవిందరాజుల బుచ్చయ్య శర్మ ధర్మపత్నీ భామాంబ గార్లకు జనించిన తృతీయపుత్రిక శ్రీ సౌభాగ్యవతియగు బాపాంబను ఏలూరులో ఆహూయసాలంకృత కన్యాదానము చెయ్యబడినది. ఆపిమ్మట శ్రీ సౌ॥ బాపాంబ నావశవర్తినియై సంచరించుచు అల్పాయుర్దాయులై గతించిన పుత్రిక పుత్రులను కనియెను. శ్రీ హరి హర భక్తిపురస్సరముగా దంపతులము ఉభయులము శ్రీ రామేశ్వరము వారణాశీ మొదలయిన యాత్రలు సేవించిన్ని చూతవన ప్రతిష్ఠయున్నూ శ్రీ కీలక సం॥ జ్యేష్ఠ శుద్ధనవమీ సోమవారంరోజున ఏలూరులో సౌధనిర్మాణమున్నూ జరిగించబడినది. నేను సామన్యభూస్థితికలిగియుండి సప్తపాకయజ్ఞములు చేసి భార్యాగ్నియుంచి యధాశక్తిగా నిత్యకర్మానుష్ఠాన పరుడనై శ్రీ శివపంచాయతననిత్య పూజాసక్తుడనై సృష్టిపూర్తి ఉగ్రరథాఖ్యాప మృత్యుశాంతి మహోత్సవమును జరిగించుకొని యిప్పటికి అరువది మూడవ సంవత్సరము వయస్సులో నున్నవాడనై సత్పండితాశీర్వాదమును కోరుచున్నాను!

# పండితాభిప్రాయములు.

౧

బ్రహ్మశ్రీ కలపర్తి వెంకట కృష్ణశర్మ పాకయాజిగారికి
అనేక నమస్కారములు.

మీరు వ్రాయించినజాబు చేరినది. విషయము గ్రహించినాను. స్పృశ్యాస్పృశ్యవివేకమును నేనుయుగంధరపత్రికలో చూచుచున్నాను. శాస్త్రయుక్తి అనుభవములతో దీర్ఘాలోచనతో వ్రాయబడిన గ్రంథమగుటచేత విషయములు బాగుగనే యున్నవి. ……………… ……అచ్చువేయించవలశినదే………………

చిత్తగించవలెను.
క. మార్కండేయశర్మ.
మద్రాసు కీల్‌పాకు. ది 18-8-34.

౨

బ్రహ్మశ్రీ కలపర్తి వెంకట కృష్ణశర్మపాకయాజిగారికి నమస్కారములు.

తాము స్పృశ్యాస్పృశ్యవివేకమును ముద్రణచేయించుట మిక్కిలి మంచిది………మీరు వ్రాసినది మాత్రము శాస్త్రసమ్మతముగా స్వప్రమాణముగా గలదు. సంశయములేదు…………గనుక విశదపరచినాను.

ఇట్లు,
శ్రీ ద్రై. మ. కోటీశ్వరదీక్షితులు.
బెజవాడ, ది 7—10—34.

౩

పశ్చిమగోదావరిజిల్లా యేలూరు పవర్‌పేట వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కలపర్తి వేంకట కృష్ణశర్మ పాకయాజిగారు రచించిన స్పృశ్యాస్పృశ్యవివేకము అనుసనాతన ధర్మప్రచారము యిదివరలోనే పూర్తిగా

వినియుంటిని. ధర్మ ప్రచారము కొరకిట్టి గ్రంథములు బయలువెడల్చుట మిక్కిలి యావశ్యకమని వేరె చెప్పనక్కరలేదు. మానవధర్మమును చక్కని సులభశైలితో పండితపామరుల కనువగురీతిని సామాన్యసామ్య యుక్తముగా నీగ్రంథమును పాకయాజిగారు రచించినందులకు సనాతన ధర్మపరులును ధర్మాసక్తులును వారికెంతయు కృతజ్ఞులనుటకు సందియ ములేదు. ధర్మప్రబోధమున కీగ్రంథము అత్యావశ్యముగాన రాష్ట్రము లోనున్న సనాతన సంఘములవారీ గ్రంథము నేపరిచారణ విషయములో వాడవలయునని కోరుచున్నాను.

ELLORE, 20-10-34. (Sd.) **P. Venkata Subbayya**, M. A., B. L., *President, Ellore Town V. D. Sangham.*

౪

శ్రీ

ఏలూరుపురవాసులు సనాతనధర్మ మార్గానుయాయులు నగు బ్రహ్మశ్రీ కలపత్రి వేంకట కృష్ణశర్మ పాకయాజిగారు సనాతనధర్మ బోధకంబుగా రచించిన స్పృశ్యాస్పృశ్య వివేకము అను గ్రంథమును చూచి నాయిచ్చిన అభిప్రాయము.

సీ. ప్రాచీనధర్మతత్పరతమించెడు కలపత్రి వేంకట కృష్ణ పాకయాజి।
శస్త్రశిష్టాచార సరణులు జనులకుదేట తెల్లంబుగ దెలుపనెంచి। శ్రుతు
లచేస్మృతులచేసారిదినాయాయిధర్మములునాచరణీయమార్గములును।
బ్రకటించి యెల్లరు వర్ణోచితములైన ధర్మమర్యాదలు దాటబోక
గీ. స్వస్వమతకట్టడల్ సాకికొనగ। గడగి పంచభూతములెతారాక్షణగాగ
జక్కగా బ్రతి విషయమును జర్చచేసి। వ్రాసె కొండొక్క గ్రంథంబు ప్రాజ్ఞులెన్న॥ ౧

చ. తన తన జాతికిం దగిన ధర్మవిభేదము తీరు, సాధువ
ర్తనముగల్గుమేలు, చెడుదారులు ద్రొక్కిన మూడు కీడులుగ్
దనమతమున్ దృఢింపక సనాతనధర్మపరుండు ప్రోత్సముం
గనునని పాకయాజియొగి గ్రంథమునన్ వివరించె నొప్పుగన్॥ ౨

చ. తనరు సనాతనార్య సుపథంబున వేంకట కృష్ణ శర్మ స
జ్జనులు గణింపగాదగిన సాధువు శిష్టుడు జాగరూకుడై
మనుగడ జక్కగానడుపు మానిసివేయును జెప్పనేటికిఁ
మనసునకించుకంత యనుమానముదోచిన నమ్మదెద్దియుఁ॥ 3

ఇటు,

కలువలపల్లి రంగనాథశాస్త్రి, ఏలూరు.

22—10—34.

శ్రీశివా.

బ్రహ్మశ్రీ కలపత్రి వేంకటకృష్ణశర్మ పాకయాజిగారికి—

మామిలా కందుకూరు అంబికానాథవరప్రసాదరావు నమస్కారములు—

మహాశయా!

'యుగంధర' పత్రికాముఖమున ప్రకటించిన 'స్పృశ్యాస్పృశ్య వివేకమను సనాతన ధర్మప్రచారము' అను వ్యాసరాజమును మొదలునుండి చివరవరకు చదివితిని. స్పృశించకూడని దానిని యేల స్పృశించకూడదో స్పృశించినందువలన కలుగు దుష్టఫలమేమో సహజములగు పంచభూతములను పంచతన్మాత్రలను, సర్వేంద్రియములను నాధారపరచుకొని యుక్తియుక్తముగా వ్రాసిన విషయములు ఆస్తికుల కెంతేని యుపయుక్తములుగ నుండుటయేగాక నవ్యవాదులయినపూర్వపక్షులను గూడ సిద్ధాంత పక్షమునకు మరల్పగల వివరములతో నిండియున్నవి. సంఘమునకై తాము చేసినశ్రమకు కృతజ్ఞతాభివందనములు.

ఏలూరు,
5—11—1934.

చిత్తగించవలెను,
విధేయుడు,
(సం)కం॥ అంబికానాథవరప్రసాదరావు.

౬

బ్రహ్మానంద సరస్వతి
స్వామివారి
మొహరు
ఉన్నది.

శ్రీ కాశీ.
శ్రీ బిందుమాధవ ఘట్టము.
శ్రీ పంచగంగేశ్వరమఠము.
అనేక నారాయణస్మరణలు.

కలపత్రి వెంకట కృష్ణశర్మగారికి.

యుగంధర పత్రికలో స్పృశ్యాస్పృశ్యవివేక మను పేరిట మీరు వ్రాసిన వ్యాసమును చదివితిని. మన శాస్త్రములందు విశ్వాసముగలిగిన యథార్థజిజ్ఞాసువులకు మిగుల నుపయుక్తముగ నున్నది.

జగత్తుమిథ్య అని అద్వైతసిద్ధాంతము. ఇందలిపదార్థములన్నియు భావనామాత్రములు. అందువలననే భార్యాభర్తలు - పితాపుత్రాదులును భావనామాత్రము లగుచున్నారు. వారలయందు గలిగెడి రాగద్వేషాదులును, తజ్జనిజ సుఖదుఃఖములును భావనామాత్రముగ పరిగణింపబడుచున్నవి. తనకంటె భిన్నమగు వారియందు వావివరుసలతో మెలంగు ప్రతివారును విధినిషేధములను పాటించుచుండుటచేత శాస్త్రబద్ధులై స్పృశ్యాస్పృశ్యములను గమనించుచున్నారు. ప్రత్యక్షానుభవములైన విషయములే భావనామాత్రము లగుచుండగా ప్రకృతమున అనుభవమునకురాని పారలౌకిక పుణ్యపాపములు - స్వర్గనరకములు భావనామాత్రములనుటసిద్ధమై ఈ భావనలు వ్యక్తిజన్యములై పరమావధిలేక పలువిధములుగ నుండుటచేత త్రికాలవేత్తలగు మహర్షులుతమ తపోమహిమచేత రచింపబడిన శాస్త్రములను పరమ ప్రమాణముగ స్వీకరింపవలసివచ్చినది. అట్టిశాస్త్రములందు విశ్వాసముకలవారే ఆస్తికులు. నాస్తికులమని చెప్పువారుకూడ తమకిష్టమైన రీతున బోధించిన పూర్వుల గ్రంథములను నమ్మి అంధపరంపరలో చేరి మూఢవిశ్వాసముతో నంగీకరించివారి వాక్యములను ప్రమాణముగ గ్రహించి వర్తించుచున్నారు. కాబట్టి అందరును యేదో వకదానిని ప్రమాణ

ముగాగ్రైకొనియే వ్యవహరించుచున్నారు. ఇట్లుండ అపౌరుషేయమగుట
చేత అనాదియైన వేదములును, తదనుసారముగ త్రికాలజ్ఞులగు
మహర్షులచేత, లోకానుగ్రహార్థమై రచియింపబడిన ధర్మశాస్త్ర
ములు ప్రమాణ గ్రంథములని నమ్మి వానిలో జెప్పబడినరీతున ఐహికా
ముష్మిక సుఖదాయకములగు విధినిషేధపూర్వక వచనముల చొప్పున
ఆచరించివున్న మనపూర్వులవలెనే మనమును ఆచరించుట కర్తవ్యము.
శ్రేయస్కరమగును. కావున మన శాస్త్రోక్తములగు స్పృశ్యాస్పృశ్య
విషయములను మనము ముఖ్యముగ గమనించి ఆచరింపవలయునేగాని
ఇటీవల అన్యదేశమందున్న అన్యమతముల వారిచేత రచింపబడిన సాధా
రణ గ్రంథములను చదివి భ్రమించి, మతాంతరులవలె ఆచరించుట
వలన, ఇహమందు నిందయును, పరమందు హానియును పొందుట నిశ్చ
యము. కాబట్టి అట్టి పామర జనుల నధోగతి నొందకుండ కాపాడు
టకై లోకానుగ్రహార్థముగ శాస్త్రప్రమాణములతోను, యుక్తుల
తోను, అనుభవములతోను, మీరు విశేషశ్రమచేసి వ్రాసిన స్పృశ్యా
స్పృశ్యవివేక గ్రంథము చిరస్థాయియై లోకుల కుపయోగించుట నిశ్చ
యము. ఈ విషయమున శ్రమచేసిన మీకనేక నారాయణ స్మరణము
లను చేయుచున్నాము.

శ్రేయోభిలాషి,
శ్రీ బ్రహ్మానంద సరస్వతిస్వామి.

# విషయసూచిక.




| | పుట. |
|---|---|
| గ్రంథారంభము ... ... | 2 |
| ఆకాశమును గురించి ... ... | 4 |
| వాయువును గురించి ... ... | 4 |
| తేజస్సు లేక అగ్నినిగురించి ... ... | 5 |
| ఆపః అనగా ఉదకమునుగురించి ... ... | 5 |
| పృథివి అనగా భూమినిగురించి ... ... | 6 |
| పంచతన్మాత్రలలోనిదగు శబ్దమును గురించి ... | 7 |
| స్పర్శను గురించి ... ... | 8 |
| ప్రస్తుతాంశమగు అస్పృశ్యతను గురించి ... | 14 |
| రూపమును గురించి ... ... | 25 |
| రసమును గురించి ... ... | 26 |
| గంధమును గురించి ... ... | 29 |
| కర్మేంద్రియములగు వాక్కు పాణిపాదపాయు ఉపస్థలచే చేయబడు పనులనుగురించి ... ... | 31 |
| మరణానంతరము విషయము ... ... | 36 |
| బ్రాహ్మణాది చాతుర్ వర్ణములనుగురించి ... | 42 |
| స్పర్శసుఖాస్పదమైన పాణిగ్రహణమును గురించి ... | 52 |
| సనాతనధర్మ నియమవర్తులైన స్త్రీ పురుషులకు స్వర్గానంద మూలమైన సత్సంతానము కలుగు విధానమునుగురించి | 60 |

అస్పృశ్యులగు చండాలాదులు పవిత్రమగు దేవాలయము
లలో ప్రవేశించగూడదనుటను గురించి ... 67

హింసాజీవన విధిలో సనాతనధర్మ నిర్ణయము అను అహింసా
సిద్ధాంతము ... ... 75

యజ్ఞములయందు పశువధను గురించి ... ... 80

గ్రామదేవతలు-జాతరలు ... ... 100



శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

శ్రీ

# స్పృశ్యాస్పృశ్య వివేకము.

అను

## సనాతనధర్మప్రచారము.

శ్లో॥ ఓన్నమో బ్రహ్మాదిభ్యో, బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశర్షిభ్యో, నమో గురుభ్యో, నమో మహద్భ్యః॥

అస్పృశ్యతానివారణ ప్రబోధము విషయములో సనాతనధర్మ నిర్ణయమును వివరించునదిగాన స్పృశ్యాస్పృశ్య వివేకము అని నామకరణము చేయబడినది.

అస్పృశ్యతానివారణ చేయుడనియు అనాదిగా నిషేధించబడిన ఛండాలాస్పృశ్యతకూడుననియు వారలను పవిత్రమయిన దేవాలయాదులలోకూడ ప్రవేశింపజేయుడనియు విశేషప్రచారము జరుగుచుండుటచే స్పృశ్యాస్పృశ్య విచారణచేయు ప్రసక్తి కలిగినది.

స్పర్శలోనుండుగుణ దోషములను వివరించుటచే గుణగ్రాహ్యులగువారలు ఆవిషయములను గ్రహించి దుష్టస్పర్శనుమాని పవిత్రవంతులును ఆరోగ్యవంతులును కాగలరను ప్రయోజనముతో వ్రాయబడినది.

సనాతనధర్మములను ఆచారములను తెలుసుకొనుటకు అను శాసనికె, శ్లో॥ ధర్మజిజ్ఞాస మానానాం ప్రమాణం ప్రథమంశ్రుతిః, ద్వితీయంధర్మశాస్త్రంతు తృతియ్యం లోకసంగ్రిహః. అను ప్ర॥ వేదము మొదటిప్రిమాణము. రెండవది ధర్మశాస్త్రము. మూడవది లోకప్రితీతి య్యైనె యున్నది. గనుక వాటిననుసరించి బుద్ధిమంతులు సావుకాశము గను సాంతముగను చదివి "హంసోయధాక్షీర మివాంబుమిశ్రం" అను ప్రకారము దోషములనువదలి గుణములమాత్రమె గ్రిహింతురని నమ్ముచున్నాను. గ్రంథవిస్తరభీతిచే ఆయావిషయములలో సూచనార్థము క్లుప్తముగా నుదహరించినవాటిని బట్టి విపులముగా సూక్ష్మాతి సూక్ష్మములను గ్రిహించవచ్చును.

అస్పృశ్యతానివారణ అనగా స్పర్శించ గూడకపోవుట అను దానిని నివారించుమనుటలోనే ఈసృష్టిలోనుండువస్తుసముదాయములో అస్పృశ్యములు కొన్ని కలవని సూచనయున్నది. స్పర్శ అనునది ప్రతిజీవుడు అనుభవించు శబ్ద, స్పర్శ రూప, రస, గంధంబులను ఇంద్రియవిషయంబులైన పంచతన్మాత్రలలో ప్రధానమైనదిగా నున్నది. ఆ పంచతన్మాత్రలను గ్రహించుటకు ఆధారముగానున్న భ. గీ 15 అ. న శ్లో. 9. శ్రోత్రం చక్షుస్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ, అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే. అను ప్రకారం జ్ఞానేంద్రియములైన శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వ ఘ్రాణములకు మనస్సు అధిష్ఠానముగా నుండి వాటివాటి విషయములను అనుభవించుచున్నారు. ఆమనస్సు మొదలగువాటికి ఆధారముగానుండు ఈదేహోత్పత్తి విషయమును గురించి శ్రుతి॥ తైత్తిరీయము బ్రహ్మావల్లి ద్వితీయ అనువాకములో "తస్మాద్వాఏ తస్మాదాత్మన ఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోన్నమ్, అన్నాత్పురుషః, సవాఏషపురుషోన్నరసమయః." అను ప్రకారము బ్రహ్మమునుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువు

నుండి అగ్నియు, అగ్నినుండి ఉదకము, ఉదకమునుండి భూమియు, ఈ భూమినుండి సమస్త ఓషధులును, ఆఓషధులనుండి అన్నాది భోజ్య పదార్థములును, అట్టి అన్నాదికమువలన జీవులున్నూ ఉత్పత్తియైరి. అందువలన జీవులు, సాత్విక, రాజస, తామస పదార్థములలో మొత్త మువీాదను యెట్టి పదార్థములను అధికముగా ననుభవింతురో అట్టి అన్నరసమయులుగా నున్నారు. పృథివ్యాది పంచభూత సమ్మేళనతో నుత్పత్తియైన ఆయాపదార్థానుభవ మిశ్రమ స్పర్శశరీరులై ఈజీవసృష్టికి ప్రధానముగాయున్న స్త్రీ పురుష అన్యోన్య స్పర్శానందజన్యమైన అన్నాది రసపరిణామ రూపమగు శుక్లశోణిత మిశ్రముజాతశరీరులని తేలి నది. అట్లు జన్మించినది మొదలు మరణపర్యంతము తిరిగి పృథివ్యాది పంచభూతముల స్పర్శాదికమువల్లను వాటివలననే వుత్పత్తియైన ఓషధీ జన్యపదార్థస్పర్శయు భక్షణాదికమువలననూ వృద్ధినొంది సదా జీవించ వలసియున్నది. గనుక అన్నిటిలోను అన్యోన్యము స్పర్శ యే ముఖ్య మయినదిగా నున్నది. మఱియు ఈదేహమునకు తాకునట్టియు, పైన పూయునట్టియు, తైలాదులు, ధరించు వస్త్రాదులు, భక్షణచేయు పానముచేయునట్టి పదార్థములున్నూ, చూచునట్టియు, ఆఘ్రాణించు నట్టియు, ధ్వనించునట్టియు మొదలగు అన్నియు ఈశరీరస్పర్శతోడనే సంబంధపడియున్నవి. కాబట్టి సమస్తజీవులు అనుభవించు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులలోను, పృథివ్యప్తేజోవాయురాకాశములగు పంచభూతములలోను, వాటివలననే యుత్పత్తియైన ఓషధీజన్యపదార్థ ములలోను, వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థ, లగుకర్మేంద్రియ ములతో జేయుపనులలోను, మంచిచెడ్డలు, పవిత్రాపవిత్రములు, లేక పరిశుద్ధాపరిశుద్ధములు కలవా, లేక అన్నియు సమానములా అనియు మొదటగా ప్రత్యేకప్రత్యేకముగానున్నూ వివరించవలసియున్నది. పిమ్మట వివిధగుణములు గలవిగానున్న ఆయాపదార్థానుభవము చే ఈజీవులకు మంచిచెడ్డలు పవిత్రాపవిత్రములు కలుగకుండునాయనియు

ఆపిమ్మట ఈజీవులకు వేటివేటిస్పర్శవలన పవిత్రతకలుగునో వేటివేటి స్పర్శవలన అపవిత్రతకలుగునో యనియు, మలభాండమువలెయున్న ఈ శరీరముకు పవిత్రాపవిత్రములతో ప్రయోజనమేమనియు మొదల యిన సంగతులు సూక్ష్మాతిసూక్ష్మబుద్ధితో విచారించుకొనినపిమ్మటనే అస్పృశ్యతానివారణ కూడునో కూడదో నిర్ణయించుకొనవలసియున్నది. అందువల్ల వాటిని క్రమక్రమముగా విమర్శించ బడుచున్నది.

ఆకాశమును గురించి.

ఆకాశము అనగా అవకాశము. ప్రతివస్తువుకులోపల వెలుపలనుండు నవకాశములో సూర్యాదిజ్యోతిర్గణముల మధ్యనుండు ఆకాశముపర్వత శిఖరములు మొదలయిన యెత్తైన ప్రదేశములయందుండు నిర్మలా కాశము, యితరములయిన యిరుకుప్రదేశములయందుండు ఆకాశము; చీకటిగదులలోను ఘటాదులయందుండు ఆకాశము, జంతుమనుష్యా దులలోనుండు హృదయాకాశము, యితర నోరు ముక్కు మొదలగు అవయవములలోను, గుహ్యాంగములయందుండు ఆకాశము, వీటిలో మంచిచెడ్డలు పవిత్రాపవిత్రములు కలవు. ఈశరీరములలో యేయేప్రదే శములందు యెట్టిఅవకాశము వుండవలెనో అట్లుండిననే తప్ప లేనియెడల అనారోగ్యముగను ప్రాణాపాయకరముగను వుండును.

వాయువును గురించి.

ఆకాశములో జ్యోతిర్గణసంచార స్థానములోనుండు మహా వాయువు, పర్వతశిఖరములు, మేడలు మొదలయిన యెత్తైనప్రదేశ ములయందుండెడి నిర్మలవాయువు, పంకా మొదలయినవి విసరుటచే గలిగినవాయువు, ఆరోగ్యవంతమయిన తూర్పు, దక్షిణ దిక్కులగాలి రోగోత్పత్తిహేతువగు ఉత్తరదిక్కు చలిగాలి, ప్రాణాపాయ కరమగు పడమటిదిక్కు వడగాలి, సముద్రగాలి, భయంకరమగు సుడిగాలి, వృక్షాదులు కూల్చునట్టి ప్రళయగాలి, యిరుకు ప్రదేశములయందుండు గాలి, సుగంధ దుర్గంధాదులనుండి వచ్చుగాలి, జంతుమనుష్యాదుల

ఉచ్ఛ్వాస నిశ్వాసవాయువు ఈ మొదలయినవాటిలో మంచిచెడ్డలు లేక పవిత్రాపవిత్రములు కలవు. కొన్ని విషవాయువులు పీల్చుటచే ప్రాణాపాయముకూడ సంభవించును.

తేజస్సు లేక అగ్నినిగురించి.

తేజస్సనగా ప్రకాశము, కాంతి, ఉష్ణాదికము అయివున్నది. ఈప్రపంచములో అన్ని తేజస్సులకంటెను ప్రధానమయిన సూర్యగ్రహతేజస్సు చంద్రాంగారకాది గ్రహతేజస్సులు సూర్యప్రతినిధియైన అగ్నియొక్క తేజస్సు, పాలాశాదియోగ్యసమిధలతోను ఆజ్యాదిహావిస్సులతోను మంత్రపూతమయిన స్మార్తశ్రౌతాగ్నుల యొక్క తేజస్సు, సామాన్యముగా గృహములయందుండు పచనాగ్ని తేజస్సు, బంగారము మొదలగు లోహకాంతులు వజ్రవైడూర్యాది కాంతుల తేజస్సు నెయ్యి నూనె ఆముదము మొదలయిన చమురులతో వెలిగించు దీపకాంతులు, పెట్రోలు, తెల్లకిరసనాయిలు, వీటితో వెలిగించు దీపకాంతులు, మెరమతాబా, తెల్లమతాబా, పచ్చమతాబా కాంతులు, సర్వజంతు మనుష్యాదులలో జఠరాగ్నిరూపముగానుండు తేజస్సు, గ్రహణములయందు మాత్రమే సంభవించు రాహుకేతుగ్రహ తేజస్సు, స్మశానాగ్నియొక్క తేజస్సు వీట్లలో మంచిచెడ్డలు, పవిత్రా పవిత్రములు కాంతిభేదములు కలవు. జంతు మనుష్యాదులలోనుండు జఠరాగ్ని మందగించిననే రోగగ్రస్థులగుటయు ప్రాణాపాయమున్నూ సంభవించును.

ఆపః అనగా ఉదకమును గురించి.

ఉదకములో ద్రవరూప పదార్థములన్నియు చేరును. వాటిలో ముఖ్యమయినవి, వర్షరూపముగా ఆకాశమునుంచి పడునట్టి నిర్మలోదకము అనేకదివ్యమయిన ఓషధీ మూలసారమై హిమాలయ పర్వతములలోనుండి ప్రవహించుచు అతిపవిత్రవంతమై భాగీరథునిచే భూలోకమునకు దేబడుటచే భాగీరథియనునామము వహించి సర్వప్రాణుల పాప

పరిహారకమయినదని పురాణప్రసిద్ధమయినట్టిన్ని శ్రీగంగామహానదీలోని వుదకమున్ను, పుణ్యనదులని కొనియాడబడు గోదావరీ, కావేరీ మొదలగు యితరమహానదులలోని వుదకమున్ను, యితరప్రవాహోదకమున్ను, వాపీ, కూప, తటాకములలోని ఉదకము, పానయోగ్యమగు మధూదకము, క్షారోదకము, సముద్రోదకము, ఆకు అలము మురిగిన గుంటలలోనివుదకము, అనేక పుష్పసారమగు తేనె, చెరకు రసము, నూనె, కిరసనాయిలు, కల్లు మొదలయిన అనేకద్రవపదార్థములు వీట్లలో మంచిచెడ్డలు, పవిత్రాపవిత్రములుకలవు. కొన్ని మురికి నీరు మొదలయినవిగాని కొన్ని ద్రవపదార్థములుగాని త్రాగిన రోగగ్రస్థులగుటయు, ప్రాణాపాయమున్ను సంభవించును.

పృథివి అనగా భూమినిగురించి.

మనము నివసించు ఈభూమండలములో అనేక భేదములుకలవు. కేవల పుణ్యాత్ములుమాత్రమే నివశించునట్టి పుణ్యభూములు, జంబూద్వీపములో పవిత్రవంతమయిన భరతఖండము, బ్రాహ్మణపురస్సరముగా వేదోక్తకర్మల నాచరించుచూ అనేకయజ్ఞములుచేసి చిరకాలము పాలించిన శ్రీభరతమహారాజువల్ల భరతఖండమను పేరు వహించి పవిత్రవంతముగానున్నది. ఈభరతఖండములో పురాతన ప్రసిద్ధములై అతి పవిత్రవంతములుగానున్న శ్లో॥ అయోధ్యా మధురామాయాకాశీ కాంచీ అవంతికా, పురీద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః. అను ప్రకారము అయోధ్య మధుర మొదలైన మోక్షదాయకములైన పుణ్యక్షేత్రములున్ను, శ్రీశైలము రామేశ్వరము మొదలయిన పుణ్యక్షేత్రములున్ను, యింకను యితర మనుష్యప్రతిష్ఠితములైన పుణ్యక్షేత్రములున్ను, అన్ని పంటలు పండునట్టి ఉదకస్వాస్థ్యముగల భూములు, కేవల వర్షమువల్లనే ఫలించు మెరకభూములు, పసువులకు ఉపయోగించు గోభూములు, వజ్రవైడూర్యాది నవరత్నములు దొరుకునట్టి విలువగల భూములు, బంగారు, వెండి మొదలగునవి దొరకునట్టి

భూములు, యినుము నేలబొగ్గు యుత్పత్తియగు భూములు, నడచుట కైనను సాధ్యముగాని గులకరాళ్ళ మెట్టలు, గడ్డిపోచయైనను మొలవని చవిటి భూములు, యేవృక్షములును లేని యిసుక మెడాపులు, దుష్ట మృగాదులచే నిండియుండి మనుష్యసంచార యోగ్యముగాని మహారణ్యములు, ధర్మలేశములేని శుద్ధకిరాత దేశములు, సూర్యరస్మి సగా లేక యెప్పుడూ మంచు కురియు దేశములు, సూర్యరస్మి అధికముగా నుండిన ఉష్ణదేశములు, అగ్నిపర్వములు కలిగి వాటిచే సదా జనోపద్రవముచే బాధపడుదేశములు, యీ మొదలైన వాటిలో మంచిచెడ్డలు లేక పవిత్రాపవిత్రములు కలవు. ఆ యా భూములలో నివసించువారల ఆహారవిహారాదులు, శరీరవర్ణాదులు,వివిధములుగానుండుట ప్రత్యక్షము గాకూడ తెలియుచున్నది.

పంచతన్మాత్రలలోనిదగు శబ్దమును గురించి.

శబ్దము అనగా ధ్వని. శ్రోత్రేంద్రియముచే గ్రహించ తగినది. శ్రుతి॥ అధర్వణీయత్రిపురతాపిన్యుపనిషత్. "శ్లో॥ ద్వే బ్రహ్మణీహిమంతవ్యే శబ్ద బ్రహ్మపరంచయత్ శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి." అనుప్ర. పరబ్రహ్మను పొందుటకు సాధనముగాయున్న శబ్ద బ్రహ్మమగు శృతి స్మృతి పురాణేతిహాసములు మొదలయిన వాటిని సదా ఉచ్ఛరించుట, వినుటయు, జ్యోతిర్గణములలో ప్రధానమగు శృతి. "అసావాదిత్యోబ్రహ్మ" అను ప్ర. ఈసూర్యుడే బ్రహ్మముగా నెంచి సూర్యాభిముఖముగానుండి ద్విజాతులు, వేదమాతయగు గాయత్రిని జపమంత్రోచ్చారణ అనుదినము ప్రాతర్మధ్యాహ్న సాయంకాలముల యందు, సంధ్యావందన రూపముగా చేయుటయు, యితర దేవతామంత్రములగు శివరామకృష్ణాదిమంత్ర జపస్మరణాదులు చేయుచుండుటయు సత్పురుష సంభాషణయున్ను అతిపవిత్ర వంతములుగానున్నవి. శూద్రాదులున్నూ వేదమంత్రోచ్చారణతప్పతక్కినవన్నియు పఠించతగియున్నది. మరియు శ్రావ్యములగు సన్నాయి, మద్దెల, వీణె, గ్రామఫోను, మొద

మైన వాటిధ్వనులు, సంతోష వార్తలు మంచివిగా నున్నవి. విషయలోలతను గలుగజేయు నవలలు నాటకములు శబ్దము లుచ్చ రించుటయు, వినుటయు యితరులను నిందించు వాక్యములు నోట వచించగూడనిదుర్భాషలు, దుఃఖవార్తలు వినుటయు, పతితసంభాషణయు, చెడ్డవి. వ్యాఘ్రసింహాదుల భయంకరధ్వనులు, పిడుగులు పడునట్టి మేఘధ్వనులు, వీటిలో కొన్ని భయంకరములు ప్రాణాపాయకరములు, దుఃఖజనకముగా నున్నవి. గనుక శబ్దోచ్చారణలోను వినుటలోను మంచి చెడ్డలు పవిత్రశబ్దములు అపవిత్రశబ్దములు కలవు. ఈ విషయ ములో సనాతనులేగాక యితర మతావలంబకులైనను దైవప్రార్థనా రూపశబ్దోచ్చారణగాని యేపవిత్ర శబ్దోచ్చారణగాని చెయ్యకుండా దైవానుగ్రహ పాత్రులుగా గాని లేక పవిత్ర తేజోవంతులుగా గాని కాజాలరు. గనుక శబ్దోచ్చారణలోను, వినుటలోను పవిత్రాపవిత్ర శబ్దములు సుశబ్దాపశబ్దములు కలవని అంగీకరించక తప్పదు. అందువల్ల వాటివాటిఉచ్చారణలనుబట్టివాచ్యావాచ్యములు, శ్రావ్యాశ్రావ్యములు కలవని సిద్ధాంతము. శ్లో॥ సంధ్యాహీనో శుచిర్నిత్య మనర్హస్సర్వకర్మసు। యదన్యత్కురుతే కర్మ న తస్యఫల భాగ్భవేత్, అనగా సంధ్య ఆచ రించనివాడు అశుచియగుటచే యెల్లకర్మలకును అయోగ్యుడు. యితర పుణ్యకర్మలు యేవిజేసినను వాటిఫలమును పొందడు అని దక్షవచనము.

స్పర్శను గురించి.

స్పర్శఅనగా త్వక్కుచేగ్రహించతగియున్నది. దానినితాకుట, కలి యుటఅనిచెప్పవచ్చును. దీనిలో మృదు స్పర్శ, కఠినస్పర్శ, సకృత్ స్పర్శ చిరస్పర్శఅను వాటివాటికి తగినట్లు గుణభేదములు కలవు. వీణె, గ్రామ ఫోను, టెలిగ్రామ్, గడియారము మొదలైనవి. మృదుస్పర్శచే గుణ వంతములు. మద్దెల, డోలు, నేలటపాకాయలు విసరుట, యితరులను దండించుట మొదలయినవి కఠినస్పర్శచే గుణవంతములు. బంగారునగ లను ధరించిన కొన్నాళ్ళకు శరీరముయొక్క మృదుస్పర్శచే మొదటి

తూనికకు తగ్గును. రాళ్లు మొదలయినవి పలుమారు స్పర్శించు చుండుట చేత క్రమక్రమముగా అరిగి గుంటలుపడును. అత్తిపత్తిచెట్టును స్పృశించినవెంటనే ఆకులు ముణుచుకొనును. తైలాదులకు సుగంధయుక్తములగు చందనము, మల్లె, గులాబీ, మొదలగువాటి స్పర్శచే సుగంధయుక్తములగును. పైవాటినిబట్టి స్పర్శవలన యేదో ఒక వికల్పమయిన వేరొకగుణము కలుగునని సూచించబడెను. గనుక ఈశరీరమునకు యేయేస్పర్శలచే మంచియు లేక పవిత్రత కల్గునో ముందుగా వివరించబడుచున్నది. అయోధ్య, మధుర, శ్రీకాశీ మొదలయిన పుణ్యక్షేత్రసంచార రూపస్పర్శచే పవిత్రులగుదురు. పద్మరాగాది నవరత్న ధారణరూప స్పర్శచే పవిత్రులగుదురు. శ్లో. రత్నాలంకృతి ధారణం రతికరం లక్ష్మీవిలాసాస్పదం, మాన్యం కామఫలప్రదాయి సుభగం మాంగళ్యమాయుష్కరం, ఓజః కాంతి యశః ప్రభావజననం దోషఘ్న మత్యుజ్వలం, భూతోన్మాదభయభ్రమక్లమ, విష, క్షీణేంద్రియాపహం. అను ప్రకారము రత్నాదులు ధరించుటచే ప్రీతికరము. లక్ష్మీప్రాప్తిహేతువు పూజ్యత్వము, కోరినఫలముల సంప్రాప్తింపజేయునవియు సౌభాగ్యము, మంగళములు, ఆయుర్వృద్ధిని, ఓజస్సును, ప్రకాశమును కలుగజేయుట భూతాదులవలన బుట్టిన ఉన్మాదభ్రమము, అలసట, విషభయము, క్షీణేంద్రియత్వమును హరించును. బంగారు భూషణములను ధరించుటచే "శుచిస్సౌభాగ్య సంతోషదాయకం కాంచనం స్మృతం" అను ప్రకారము పవిత్రతయు సంతోషము, సౌభాగ్యము కలుగును. రుద్రాక్షధారణను గురించి సామవేదీయ రుద్రాక్షజాబాలోపనిషత్తులో శ్రుతి "భగవన్ కాలాగ్నిరుద్రః త్రిపురవధార్థమహం నిమీలితాక్షోభవన్ తేభ్యోజలబిందవో భూమౌపతితాస్తే రుద్రాక్షాజాతా స్సర్వానుగ్రహార్థాయ, తేషాం నామోచ్చారణ మాత్రేణ దశగోదాన ప్రదానఫలం. దర్శన స్పర్శనాభ్యాం ద్విగుణఫలమత ఊర్ధ్వం వక్తున్న శక్నోమి, అని యుండుటచే రుద్రాక్షధారణ రూపస్పర్శ అతి

పవిత్రవంతమయినది. భద్రాక్షులు, స్ఫటికములూ, తులసిపూసలు, పవిత్ర స్థలములయందలి మృత్తుచే ఊర్ధ్వ పుండ్రధారణ, పవిత్రభస్మముచే త్రిపుండ్రధారణ మొదలయినవి పవిత్రములు. నర్మద బాణలింగములు సాలిగ్రామము మొదలగువాటిని పూజారూప స్పర్శచేతను; అశ్వత్థ, తులసీ, బిల్వాది వృక్ష ప్రదక్షిణ పూజా రూప స్పర్శచేతను పవిత్రత కలుగును. గోవును పూజారూప స్పర్శచేతను వాటితాలూకు పంచ గవ్యములు అనగా పాలు, పెరుగు, నెయ్యి,మలము,మూత్రం,భక్షణాదిక ముచే అతి పవిత్రులగుదురు. గులాబీ,సంపెంగ,మల్లె మొదలగు సువాసన పుష్పధారణ, చందనము, కర్పూరము మొదలగు సుగంధస్పర్శ చేతను పవిత్రవంతముగనుండును. శ్లో. గంగాగంగేతి యోబ్రూయా ద్యోజనా నాం శతైరపి। ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి, అనగా అనేక యోజనముల దూరములందుండి యైనను శ్రీగంగామహానదిని స్మరించిన మాత్రముననే విష్ణులోకము నొందునని యున్నది. అట్టి పవిత్రమయిన శ్రీగంగామహానదిలోని వుదక స్నానపానాదుల స్పర్శచే అతిపవిత్రు లగుదురు. గోదావరి, కావేరి, మొదలగు మహానదులలోని వుదకస్నాన పానాది స్పర్శచేతను పవిత్రులగుదురు. తక్కిన యితర ప్రవాహోదక ములలోను వాపీకూప తటాకాదులలోను ఆయావుదకములనే గంగో దకములనుగా స్మరించుచూ అభిమంత్రించుచూ స్నాన పానాదులను చేయుచుండిన పవిత్రులగుదురు. వాట్లలో ఒకదానికంటె నొకటి న్యూన పవిత్రములుగానుండును. "తేజోధికో భవేద్భాను" అను జ్యోతిశ్శాస్త్ర వచనము ననుసరించి సూర్యగ్రహకాంతి ధ్యాన దర్శనాది స్పర్శచే తేజోవంతులగుదురు. గనుకనే ముందుగా సూర్యప్రార్థనారూప దర్శ నాదులు నిర్ణయించియుండిరి. సూర్యకాంతి తగులనిది జీవరాసులు వృద్ధినొంది తేజోవంతములు కాజాలవు. ఓషధిపతియగు చంద్రగ్రహ కాంతి స్పర్శచే ఓషధులు సత్వవంతములగును. వాటివలన మనోదార్ఢ్యత కలుగును. బ్రాహ్మణ గ్రహములగు గురు శుక్ర గ్రహకాంతి స్పర్శచే

యితర పాపగ్రహకాంతి స్పర్శచే గలిగిన దోషనివృత్తి పూర్వకమయిన జ్ఞాన సుఖములు కలుగును. గనుకనే బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యులు గురు శుక్రగ్రహకాంతి ప్రసారము లేని మూఢ కాలములయందు వివాహాది శుభకార్యములు చెయ్యకుండుటకు కారణమైయున్నది. పవిత్రవంతములయిన మోదుగుసమిధలు రావి సమిధలు మొదలగువాటితో మంత్రపూతముగా ప్రజ్వలించబడి ఆజ్యాదిహవిస్సులు హోమము చేయుచుండు స్మార్తాగ్ని శ్రౌతాగ్నులయొక్క స్పర్శ ప్రతిదినము ద్విజాతులకు శరీరమునకు తగులుచుండుటచే క్రమక్రమముగా పవిత్ర తేజోవంతులగుదురు. అందువల్లనే ద్విజాతులకు "అగ్నిర్దేవో ద్విజాతీనాం" అను ఉత్తరగీతావచన ప్రకారము ఆమరణాంతము అగ్నిహోత్రములుంచుటకు కారణముగానున్నది. అయోధ్య, మధుర, శ్రీకాశీ, రామేశ్వరము మొదలగు అనాది పుణ్యక్షేత్రములలోనివన్ని యితర ప్రతిష్ఠితములయిన దేవాలయములలోనివన్ని యగు ఆయా మూర్తి పవిత్ర తేజోస్పర్శ దర్శనము చేయువారి శరీరమునకు తగులుటచే పవిత్రులగుదురు. గనుకనే ఆయా దేవాలయములలోని మూర్తి దర్శనముకు కారణముగా నున్నది. గాని ఆ యా దేవాలయములలోని మూర్తివంతముకు లేక దేవతాసాన్నిధ్యముకు లేక పవిత్రత తేజస్సుకు భంగము కలుగకుండునట్లు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రపతిత రజస్వల ఛండాలాదులు యేయే దూరవ్యవస్థలోనుండి మూర్తిదర్శనము చేయవలసినదిగా శాస్త్రనిర్ణయమున్నా అనాదిగానుండు ఆచారమున్నా గలదో అట్లే దర్శించవలెను. అట్లుగానియెడల తమ దుష్ట తేజస్సువలన ఈశ్వర తేజస్సుకు న్యూనతకలుగజేసిన పాపము సంభవించును. ఏయే ఆధారములవలన దేవాలయములలోని దేవుని దర్శించిన పుణ్యముగలదని నమ్మకముగలదో వాటినిబట్టియే బ్రాహ్మణాదిజాతి మతాచార వ్యవస్థలోనుండి దేవుని దర్శించుటతోనే పవిత్రులగుదురు. ఘ్రాణేంద్రియముచే సదా సుగంధద్రవ్యములనే ఆఘ్రాణించుటచే ఆరోగ్యవంతులును

పవిత్రవంతులును అగుదురు. పర్వతశిఖరములు, మేడలు మొదలగు యెత్తైన ప్రదేశముల, నిర్మలవాయుస్పర్శయు, తూర్పుదిక్కు దక్షిణ దిక్కుగాలి స్పర్శలు పవిత్రములు, రేచక పూరక కుంభకములచే పరిశుద్ధవాయువును పూరించుటయు కుంభించుటయు, విడుచుటయు అనునట్టి ప్రాణాయామమును వాయుస్పర్శచే సదా శరీరము అతిపవిత్రవంతముగా నగుచుండును. యాజుషీయ అమృతనాధోపనిషత్తు శృతి. "యధాపర్వత ధాతూనాం దహ్యంతే ధ్మమనాన్మలాః, తథేంద్రియ కృతాదోషా దహ్యంతే ప్రాణధారణాత్. ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చకిల్బిషం" అను ప్రకారము పర్వతసంబంధమయిన కఠిన లోహాదులను కరగుటకు అగ్నిని ప్రజ్వలింపజేయు సాధనముగాయున్న ఊదుడుగొట్టముచే ఆలోహాదులయందుండే మలాదులను పోగొట్టి పవిత్రముచేయునట్లుగనే ప్రాణాధారణవలన ఇంద్రియ కృతములయిన దోషములు దహించబడును. ప్రాణాయామమువలన ఇంద్రియకృతదోషములు కాల్చివేయబడును. ధారణవలన పాపములు నశింపజేయును. యిదియే అభివృద్ధిజెందినకాలది యోగాభ్యాసమన బడును. యిందువలన అణిమాదిసిద్ధులు కూడ పొందగలుగును. శ్లో. అణిమా మహిమాచైవ గరిమాలఘిమాతథా, ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతదయః. అనునవి అష్టసిద్ధులుగా నున్నవి. ఈ శరీరములో నుండు హృదయాకాశాంతర్గతుడగు మనోజ్యోతిని పవిత్రను చేయుటకుగాను శివరామ గోవిందాది భగవన్నామోచ్చారణ సదాచేయుచుండుట పవిత్రశబ్దాదులనే వినుచుండుట అను శబ్దాది స్పర్శచేతను క్రమక్రమముగా పవిత్రతేజోవంతుడగును. అందువలననే ప్రతిరోజు ద్విజాతులు త్రికాలములయందు గాయత్రి జపమున్ను యోగ్యులైన గురూపదేశపూర్వకముగా లభించిన వివిధములుగానున్న యితరదేవతా మంత్రజపాదులచేతనున్ను హృదయ స్పర్శాదికము సదాచేయుచుండుటకు కారణముగా నున్నది. రసగ్రహణమును జిహ్వాం

ద్రియముచే రాజస, తామస, పదార్థములను వదలి సదాసాత్వికపదార్థానుభవస్పర్శయే చేయుచుండుటచే క్రమక్రమముగా పవిత్రులగుచుందురు.

వస్త్రధారణలో శ్లో. బ్రాహ్మణస్యసితంవస్త్రం నృపతే రక్తముల్బణం, పీతం వైశ్యస్య శూద్రస్య నీలం మలవదిష్యత ఇతి. బ్రాహ్మణులు తెల్లని వస్త్రము, క్షత్రియులు ఎఱ్ఱని వస్త్రమును, వైశ్యశూద్రులు పచ్చని వస్త్రమున్నూ ధరించవలసినది. నీలవస్త్రము మలవత్తుగా భావించి త్యజించవలసినది. శ్లో. స్నానం దానం తపోహోమ స్వాధ్యాయః పితృతర్పణం, వృథాతస్య మహాయజ్ఞా న్నీలీసూత్రస్యధారణాత్. అని యుండుటచే నీలీసూత్రముతో గూడిన వస్త్రధారణతో జేయబడు స్నాన దాన జపాదులు నిష్ఫలములగును. ద్విజాతులు ధరించు యజ్ఞోపవీతము బ్రహ్మోపనిషత్తు శ్రుతి. కర్మణ్యధి కృతా యేతు వైదికే బ్రాహ్మణాదయః, తేభిర్ధార్య్యం మిదంసూత్రక్ క్రియాంగం తద్ధివైస్మృతం. అను ప్రకారము వేదవిహితమగు గాయత్రీ ఉపాసనాదికర్మలయందు అధికారము గల బ్రాహ్మణాదులచే యజ్ఞోపవీతమును బాహ్యమునకు క్రియారూపముగా ధరించబడుచున్నది. పరబ్రహ్మోపనిషత్తు శ్రుతి. ఏవం బహిర్లక్షిత కర్మశిఖాజ్ఞానోపవీతం గృహస్థస్యాభాస బ్రాహ్మణ త్వస్య కేశ సమూహశిఖ, ప్రత్యక్ష కార్పాస తంతుకృతోపవీతత్వం. అను ప్రకారము బ్రాహ్మణత్వ యోగ్యతాసిద్ధి సాధకములగు సంధ్యావందన యజ్ఞాదికర్మ లాచరించు వారలు తలవెంట్రుకల ముడివైచుకొనునట్టి శిఖయును ప్రత్యక్షముగా పత్తితో వడకబడిన నూలుతోనున్న ఉపవీతమును మంత్రపూతముగా ధరించుటచే మిక్కిలి పవిత్రవంతులును బ్రహ్మతేజోశక్తిగలవారలుగను అగుదురు. జ్ఞానశిఖయు, జ్ఞానయజ్ఞోపవీతమును గల యతులు శ్రుతి. "సశిఖం వపనంకృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః, యదక్షరం పరబ్రహ్మ తత్సూత్రమితిధారయేత్" అను ప్రకారము జుట్టుతో కూడ కేశఖం

డనము చేసుకొని బాహ్యమునకు ధరించిన యజ్ఞోపవీతమును తీసివేసి నాశరహితమగు పరబ్రహ్మ మేదికలదో దానినే యజ్ఞోపవీతముగా ధరింతురు.

ప్రస్తుతాంశమగు అస్పృశ్యతనుగురించి.

అస్పృశ్యత అనగా స్పృశింపగూడనివాటిని వివరించబడుచున్నది. దుష్టపదార్థస్పర్శచే శిష్టపదార్థములకు చెరుపుగాని దుష్టపదార్థములకు చెరుపులేదు. శ్లో॥ "గోమూత్రమాత్రేణ పయోవినష్టం, తక్రస్య గోమూత్ర శతేనకింవా, అత్యల్పపాపై ద్విపదశ్శుచీనాం, పాపత్మనాం పాపశతేనకింవా." అనగా పాలలో గోమూత్రబిందువు పడినయెడల అవి విరిగిపోవును. చల్లలో గోమూత్రబిందువు లెన్నిపడినను చెరుపు లేదు. అట్లే పవిత్రవంతులైన వారలకు మిక్కిలి స్వల్పపాపములకైనను విపత్తుకలుగును. సహజపాపులైనవారలకు యెన్నిదుష్టకర్మలుచేసినను చెరుపుయుండదు. బంగారుకు పాదరసస్పర్శచే రంగుమారును. పాదరసముకు బంగారుస్పర్శచే చెరుపులేదు. పాతివ్రత్యస్త్రీకి పరపురుష స్పర్శచే కూడిరాని చెరుపు సంభవించును. వేశ్యకు చెరుపులేదు. కలరా మశూచి మొదలగు వ్యాధిగ్రస్తులకు ఆరోగ్యవంతులు తాకినయెడల కూడిరానిచెరుపు కలుగును. రోగగ్రస్తునికి చెరుపులేదు. అద్దముకు మలినస్పర్శచే కాంతి మాసిపోవును. మలినమునకు చెరుపులేదు. ఎలక్ట్రిక్‌తీగెను స్పర్శించిన ప్రాణాపాయము సంభవించును. తీగెకు చెరుపు లేదు. చుంచుతాకిన పదార్థములు దుర్గంధయుక్తములగును. చుంచుకు చెరుపులేదు. సర్పవృశ్చిక వ్యాఘ్రాదులను స్పర్శించిన ప్రాణహాని సంభవించును. వాటికి ఏమిన్ని చెరుపుయుండదు. అగ్నినిస్పర్శించిన కాలును. అగ్నికి చెరుపులేదు. దుష్టతేజస్సుగల ఛండాలాదులను పవిత్రతేజస్సుగల బ్రాహ్మణాదులు స్పర్శించినయెడల నష్టతేజస్కులై చెడుదురు. ఛండాలాదులకు ప్రత్యక్షముగా చెరుపులేదు.గాని బ్రాహ్మణాదుల పవిత్రతేజస్సును నష్టపరచిన దోషము సంభవించును. విషము

ములగు గులకరాళ్ల మెట్టలు, మనుష్యసంచారములేని మహారణ్యములు, చెట్లు చేమలులేని యిసుక యెడారులు, ధర్మలేశములేని కిరాతదేశములు, సూర్యరశ్మిలేక కేవలము మంచుకురియుదేశములు, మిక్కిలి ఉష్ణప్రదేశములు, అపాయకరమగు అగ్నిపర్వత ప్రదేశములు, ఏపైరుకును యోగ్యముకాని బ్రహ్మహత్యాదోషయుక్తములైన ఊసరక్షేత్రములు, యివి మొదలగువాటిలో సంచారరూపస్పర్శవలన ప్రాణాపాయములు గను, చెడ్డను కలుగచేయునవిగను ఉండును. యిత్తడి యినుము మొదలగువాటితో చేయబడిన భూషణములు బంగారువలె నటింపజేయు కృత్రిమభూషణములు, కృత్రిమరత్నాదులు ధరించుటచే తేజోహీనులగుదురు. శ్రీమద్రామాయణములో నుదహరించిన ప్రకారము వశిష్ఠపుత్రుల శాపవశమున త్రిశంకుడు పొందిన ఛండాలత్వములో నీలివస్త్రధరుండును తలవెంట్రుకలు ముడుచనివాడును అగు మొదలైన దుర్లక్షణములు కలవాడగుటచే ఛండాలులకువలె జుట్టు ముడి లేకుండుటయు ఛండాలధారణకు చెప్పబడిన నీలివస్త్రమును ధరించుటయు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యులకు నిషిద్ధము. అగ్నిమండలపు చెట్టును దూలగొండికాయను స్పర్శించిన విశేషబాధ కలుగును. శనినివాసమగు విభీతకవృక్షమునీడనుండుట, స్పర్శించుటవలన శనిపీడగలుగును గనుక తాక కూడదు. అమేధ్యాదులను స్పర్శించుట కూడదు. మురికి గుంటలలోని ఉదకముస్నానపానాదుల కుపయోగించుట త్రాగుటకు అనర్హములగు క్షారోదకాదులు వీటిచే అనారోగ్యమును అపవిత్రతయు కలుగును. హేమాద్రియందు "శ్లో॥ సింహకర్కటయోర్మధ్యే సర్వానద్యో రజస్వలాః, తాసుస్నానం నకుర్వీత వర్జయిత్వాసముద్రగాః." సముద్రగాములైన మహానదులు తప్ప తక్కిన అన్ని నదులున్నూ సింహ కర్కట మాసములకుమధ్యను రజస్వలా దోషయుక్తములుగ నుండును. గనుక స్నానాదులకు నిషేధము. మహానది షుభవిత్యేయుక్తః. "ఆదౌతు కర్కటేదేవి మహానద్యో రజస్వలాః,

త్రిదివంచ చతుర్దేహ్నా శుధాస్యుర్జాహ్నవీ యథా." అనుప్ర. మహా నదులైనను కర్కాటమాసాదియందు మూడురోజులు రజోదోష యుక్తములై నాలుగవదినమున గంగోదకమువలె పవిత్రములగునని యున్నది. గనుక ఆ యా కాలములందు సర్వనదులు రజోదోషయుక్త ములై బ్రహ్మహత్యాదోషరూపమగు అతికల్మషమగు నురుగు తెప్పలతో చేరియుండునుగాన స్నానాదులకు అపవిత్రములుగానుండును శ్లో."సర్వేషా మేవవర్ణానాం సూతకే రాహుదర్శనే, సచేలంతు భవేత్ స్నానం సూత కాన్నం చ వర్జయేత్." అని బ్రహ్మకైవర్తమునందున్న ప్ర. సూర్య చంద్రగ్రహణములయందుమాత్రమే కలుగునట్టి రాహు, కేతు కాంతి ప్రసారమువలన బ్రాహ్మణాది నాలుగువర్ణముల వారికిని సూతకము సంభవించుననియు ఆ సమయములోనుండు కట్టుబట్టలతో స్నానము చేయవలసినదనియు విధించియున్నది. మరియు "శ్లో. చండాలాజాతిస్తుసహా సంహికేయః కేతుశ్చ జాత్యంతక మేవిమాన్యః." అను జ్యోతిశ్శాస్త్ర వచనప్రకారము రాహుకేతుకాంతి ప్రసారము ఛండాల స్పర్శవలెనే అందరికి స్నానదాన జపాదులచే పవిత్రులగుచున్నారు. ఆయాగ్రహణ సమయముల యందుండు సస్యాదులు మొ. వాటికి యేదోవిధమయిన కొంతచెరుపున్నూ కలుగును. గర్భిణీస్త్రీలకు రాహుకేతు కాంతి ప్రసరించినను లేక దానియందే వారలు ధ్యానముంచినను అంగవైక ల్యాలు కురూపులు జన్మించుదురు. గ్రహణముపట్టిననక్షత్రము ఆరు మాసములువరకు వివాహాదిశుభకార్యములకు త్యాజ్యము, అని జ్యోతి శ్శాస్త్రము విధించుచున్నది. శ్మశానాగ్నియొక్క కాంతిప్రసారము వలన అపవిత్రులగుదురు. అదేవిధముగా సహజ అపవిత్రులయినవారి తేజోస్పర్శవలన అపవిత్రులగుదురు. ఉత్తరదిక్కుగాలి పశ్చిమదిక్కు వడగాలి సుడిగాలి దుర్గంధయుక్తమగుగాలి స్పర్శాదులవలన అనారోగ్యా లును అపవిత్రులును అగుదురు. దుష్టఉచ్ఛ్వాసనిశ్వాసవాయు స్పర్శచే అపవిత్రులు. జిహ్వేంద్రియముచే అనుభవించు వాటిలో నిషిద్ధములగు

శ్రుతి. "మద్యం మాంసంచ లశునం, ఫలాండు, శిగ్రుమేవచ, శ్లేష్మాతకం, విడ్వరాహా మభక్ష్యంవర్జయేన్నరః." అనగా కల్లు, మాంసము, వెల్లుల్లి, నీరుల్లి, ములగ, శ్లేష్మాతకం, ఊరపందిని మొదలయిన అభక్ష్య పదార్థములను వర్జించవలసినది. గంజాయి, పొగాకు మొ॥ మత్తుద్రవ్యములున్నూ యింకను యితరశాస్త్రములలో నిషేధించబడియున్న పదార్థములనున్నూ భక్షణరూపస్పర్శ చేయుటచే అపవిత్రులగుదురు. రజక, చండాల, రజస్వలాదిఅపవిత్రుల శబ్దోచ్చారణ భగవదారాధన మొ॥ పవిత్రకార్యములు చేయునప్పుడు వినుట, వారితో మాటలాడుట, విషయలోలతనుబోధించు శబ్దాదులను వినుట వచించుట యనునట్టి స్పర్శలు అపవిత్రములు. దేవలమహర్షి "శ్లో. సల్లాపా స్పర్శనిశ్వాస సహ శయ్యాసనాశనాత్, యాజనాధ్యాప నాద్యోనాత్పాపం సంక్రమతే నృణాం." అనగా మాటలాడుట, ముట్టుకొనుట, ఊపిరివిడుచుట, కలసి పరుండుట, కలసికూర్చొనుట, కలసి భోజనము చేయుట, యాజనము, అధ్యాపనము, యోనిసంబంధము అను వీటివలన ఒకనిశరీరములోనుండి వేరొకని శరీరములోనికి పాపము సంక్రమించునని చెప్పియున్నారు. తన తల్లిగర్భములోనుండి తాను జన్మించియు స్తన్యపానము చేసియున్నప్పటికి తిరిగి ఆయా అవయవములను వయోవంతుడై స్పర్శించకూడదు. ఏమనిషి అయినను తనశరీరము అయినప్పటికి అధమావయవములను ఆయా సమయములందేతప్ప యితరసమయములలో తాకకూడదు. తన భార్యఅవయవములకున్నూ తమచెల్లెలుకూతురు మొదలగువారిఅవయవములకున్నూ భేదము లేదుగదాయని వారిని స్పర్శించకూడదు. చేతితో తాకినదానివలెనే పాదముతో తాకిననేమని పాదముతో తాకకూడదు. చేతితో నైననూ, కాలితో నైననూ, కఠినముగా తాకకూడదు. అన్యస్త్రీని తాకినమాత్రముచేతనే దోషముండునాయని అంగస్పర్శగాని, ఆలింగనముగాని, ముద్దుపెట్టుకొనుటగాని కూడదు. స్త్రీసంభోగముకూడ స్పర్శసుఖములోనిదేగదాయని స్పర్శదోషములేదనీ చెప్పను

ప్రతిస్త్రీనిస్పర్శించుటకు సిద్ధపడకూడదు. కలరా, ప్లేగు, మశూచి మొదలగు సంక్రామికరోగగ్రస్తులను తాకకూడదు. తనభార్యయయినను యితర స్త్రీయయినను బహిష్టుఅయిన స్త్రీలను ఇంద్రుని బ్రహ్మహత్యాదోష యుక్తులగుటచే నాలుగవనాడు శుద్ధిపర్యంతరము తాకకూడదు. జాతాశౌచ మృతాశౌచముగలవారలను శాస్త్రనియమితశుద్ధి పర్యంతము తాకకూడదు. స్నానాదులచే తానుపవిత్రుడైయుండి అపవిత్రుడుగానున్న తనకుమారుని సగా తాకకూడదు. తమకంటె అగ్రవర్ణమువారిని అందరుమనుష్యులేకదాయని తాకకూడదు. తమకంటె హీనవర్ణమువారినిన్ని తాకకూడదు. ఒకవేళరయిళ్ళలోను జనసమ్మర్దముగల సభాదులయందును అవశముచే తాకుటను పురస్కరించుకొని యెల్లపుడును తాకుటకు సిద్ధపడకూడదు. సదా అమేధ్యపదార్థ భక్షణచేయునట్టి శునక, శూకర గార్దభాదులను తాకగూడదు. శునక శూకర కుక్కుటాదులను మృతగోమాంసభక్షణాదులను సదాచేయునట్టిన్ని దుర్గంధయుక్తములయిన చర్మకారాదివ్యాపారాదులను చేయునట్టిన్ని వంశపారంపర్యము దుష్టరజోశుక్లములచే జన్మించినట్టిన్ని దీర్ఘసాంక్రామిక దుష్టతేజస్కులైనచండాలాదులను తాకకూడదు. పవిత్రాపవిత్ర తారతమ్యములనుబట్టి పారాశరస్మృతిలో శ్లో॥ "యుగంయుగ ద్వయాచైవ త్రియుగంచ చతుష్టయం చండాలాది శూతికోదక్యాపతితానా మధఃక్రమాత్." అనగా చండాలులకు నాలుగుకాండ్లదూరమును, ముట్టువాండ్లకు రెండుకాండ్లదూరమును పాపాత్ములకు వకకాడిదూరమున్ను నిర్ణయించబడి ఆదూర వ్యవస్థకు లోనయినయెడల అపవిత్రులగుదురనియు చెప్పబడియున్నది. శ్లో॥ "చండాలస్పర్శనేసద్యః ఆదిత్యమవలోకయేత్, చండాల స్పర్శనేచైవ సచేలస్నానమాచరేత్" అనగా చండాలునిస్పృశించినతోడనే ముందుగా తేజోవృద్ధికొరకు సూర్యుని చూడవలయునని కట్టుబట్టలతో స్నానము చేయవలెనియు విధించియుండిరి. సామవేదీయసన్యాసోపనిషత్తులో "ఘోరమంత్యజమివ, జ్ఞాతచరదేశం చండాలవాటిం కామివ పరిత్యజ్య"

గ్రామమునకు వెలుపల నివాసమేర్పరుచుకొని వారలలోకూడఅనేక హీన తరగతులుగా నెన్నబడినవారియొక్క అస్పృశ్యతపాటించుటయు యిప్పటికిన్ని ఆచరణలోనున్నది. మాలవాండ్లలో మాలలనియు, శివకంఠ మాల్లలనియు, మాలదాసరివాండ్లనియు, మాలమాష్టీన్ వాండ్లనియు పంబలవాండ్లనియు, మాలభోగమువాండ్లనియు, గుర్రంమల్లాయకులమనియు, వారలలో వకరికంటెవకరు తక్కువగా నెన్నబడుచు గుర్రంమల్లాయకులము వానిని మాలగూడెముకు వెలుపలనేఉంచుటయు, వానిని పైవారలు తాకినయెడల స్నానముచే శుద్ధులగుటయు ఆచరణలోనున్నది. మాలలు అనువారలు మాదిగలు అనువారలను తాకరు. మాదిగవాండ్లలో మాదిగ మాష్టీన్‌వాండ్లు కొమ్ముల వాండ్లనియు మాదిగభోగమువాండ్లు డెక్కలవాండ్లనియు వారలలోవారలు వకరికంటెఒకరు తక్కువగా నెన్నబడుచు డెక్కలవానిని మాదిగగూడెముకు వెలుపలగానుంచుటయు వానినితాకిన స్నానముచే శుద్ధులగుటయు ఆచరణము లోనున్నది. యింకను వారిలో దేశభేదముచే అనేక హీనజాతులుండవచ్చును. పైనవివరించిన చండాలాదులలో వారలలో వారలు అనేకతరగతులుగానుండి స్పర్శదోషము పాటించు చుండుటయు, అన్యోన్యభోజనములుగాని, వివాహసంబంధములుగాని లేశము లేకుండుటయు సహజముగానున్నది. ఒకయిల్లుతగులబడుచుండగా మధ్యనున్న యిల్లు పడగొట్టుటయు కలరా మొదలగు వ్యాధిగ్రస్తులను వూరివెలుపల గుడిసెలలో నుంచుటయు, లోకులకున్నూ వారికిన్ని మంచికొరకే గాని ద్వేషమూలకము ఎట్లుకాదో అట్లే సర్వభూత దయాళువులయిన మహాఋష్యాదులు, శిలతరు, గుల్మ క్రిమికీటకాదులున్న జంతుమనుష్యాదులయిన అన్ని ప్రాణులున్నూ తదితరప్రాణులకు హానిలేకుండా క్రమక్రమముగా నుత్తమోత్తమజన్మల నెత్తుటద్వారా తుదకు మోక్షమునందుటకు తగిన సాధనమూలములగు ధర్మశాస్త్రములనిర్ణయించిరే గాని యెవ్వరికిన్ని చెరుపుకలుగు నుద్దేశ్యములేదు. గనుక మనము శాస్త్ర

బద్ధులమై యుండవలెను. శ్లో. "శ్రుతిస్మృతి మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేది మమద్రోహీ సమేవధ్యతమోమతః." అనుప్రకారం భగవదాజ్ఞలగు శృతిస్మృతులను మీరినడచువారలు నాకు ద్రోహము చేసినవారలగుదురని యుండుటచే బుద్ధిపూర్వకముగా చండాలాదులను స్పర్శించి నష్టతేజోవంతులయిన బ్రాహ్మణాదులున్నూ ఉత్తమజన్మల నెత్తుటకు ప్రయత్నించు బ్రాహ్మణాదులను వారి పవిత్రతేజస్సును తమదుష్టతేజస్సువలన బుద్ధిపూర్వకముగా భ్రష్టతజేయునట్టి చండాలాదులున్నూ తమకంటెతక్కువ దర్జాలోనుండు మనుష్యక్రిమికీటకాదిజన్మల నెత్తవలసివచ్చును. భ. గీ. అ 16 శ్లో. 19 తానహంద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామ్య జస్రమశుభానాసురీశ్వేవ యోనిషు. అను ప్రకారంనాకు శత్రువులయిచెడుమనస్సుగలనీచులను యెల్లప్పుడు రాక్షసాంశగల నికృష్టజన్మలనెత్తునట్లుగా జేయుచున్నానని చెప్పబడియున్నది.

సనాతనాచారప్రకారము పవిత్రతేజస్సుగలవారలు దుష్టతేజస్సుగల వారలను సమీపించినయెడల లేక స్పర్శించినయడలను సూదంటురాయి యినుమును ఆకర్షించునట్లును ఎలక్ట్రిక్ తీగెపయిన చేయివైచిన తేజస్సును ఆకర్షించి ప్రాణహీనునిజేయునట్లును ఒక తెల్లమతాబాను, యెర్రమతాబాను సమీపముగా వెలిగించినయెడల ఆరెంటియొక్క మిశ్రమయిన వేరొక కాంతికలుగునట్లును దుష్టతేజస్సును ఆకర్షించి పవిత్రతేజస్సు క్రమక్రమముగా క్షీణించును. దుష్టస్పర్శాదులవలన చెరుపుకలిగిన పిమ్మట కలిసిరానిస్థితిలో విచారించుటకంటె ముందుగనే శ్రద్ధవహించుట మేలుగనుండును.

శ్లో. "హరిశ్చంద్రో నలోరాజాపురుకుత్సఃపురూరవః, సగరఃకార్తవీర్యశ్చ షడైతే చక్రవర్తినః." అనుప్రకారంషట్చక్రవర్తులకంటెపూర్వపువాడైన హరిశ్చంద్రుని తండ్రియగు త్రిశంకుమహారాజును వసిష్ఠుని పుత్రులిచ్చిన శాపమువలన ఆగంతుకముగా సంక్రమించిన చండాలత్వమును పోగొట్టుటకు మేనితో స్వర్గమునకుపంపించెదనని ప్రతిజ్ఞ చేసినవిశ్వా

మిత్రుడు తనతపశ్శక్తినంతయు ధారవోసినను స్వర్గమునందుంచలేక పోయెను. ఇంద్రునిచే చండాలుడా నీవు యిచటనుండతగవు, అని తల క్రిందుగా త్రోయబడినట్లు శ్రీమద్రామాయణములోని త్రిశంకుని చరిత్రమున తెలుచుండగా పారంపర్యక్రమాగతముగా సహజచండాలు లయిన వారిని తాకకూడదని వేరేచెప్పవలయునా?

వెనుకటి చరిత్రాంశము లెట్లున్నను ప్రస్తుతము తురుష్కులను, యితర ఘోరపాపులయిన వారలను తుదకు చండాలురను తాకుచుం డుటలేదా యనినను అస్పృశ్యత పాటించునట్టి సనాతను లెవరును బుద్ధి పూర్వకముగా తాకరు. ఒకవేళ ప్రమాదముచే తాకినను ఆయా సమయ ములకు తగినట్లుగా ప్రాయశ్చిత్తాదులు చేసికొనుచుందురు. అయినను కొన్ని విశేష కాలములయందును, ఆపదలయందును పారాశర్యులవారు యేర్పర్చినట్లో. 'ఆపత్కాలేతుసంప్రాప్తే శౌచాచారంనచింతయేత్, స్వయ ముద్ధరేత్ పశ్చాత్ స్వస్థోధర్మం సమాచరేత్. దేశభంగే ప్రవాసేవా వ్యాధిష్వ్యసనేష్వపి, రక్షేదేవ స్వదేహాని పశ్చాద్ధర్మం సమాచ రేత్.' అనియు బృహస్పతి 'తీర్థే వివాహే యాత్రాయాం సంగ్రామే దేశవిప్లవే, నగరగ్రామదాహే చస్పృష్టాస్పృష్టిర్న దూష్యతే' అను ప్రకారము వ్యవస్థలున్నవి. ఆపత్కాలమునందును దేశోపద్రవము సంభవించినప్పుడున్ను అన్యస్థల సంచారమునందును రోగగ్రస్తుడై నప్పుడును విశేష విచారము, లేక దుఃఖసంప్రాప్త కాలములయందును శౌచాచారములను పాటించకున్నను దూష్యులుకారనియు, అట్టి వాటి యందు తన దేహరక్షణచేసుకొని స్వస్థుడైన పిమ్మటనే ధర్మమాచరింప వలెననియు పారాశర్యులవారును పుణ్యనదీ స్నానాదులయందును వివా హాదులయందును పుణ్యదేశ సంచార యాత్రాదులయందును యుద్ధా దులు జరుగు కాలములయందును దేశోపద్రవములయిన భూకంపాదులు తటస్థమయినప్పుడున్ను నగరముగాని వూరుగాని కాలుచున్నప్పుడున్నూ స్పర్శదోషముపాటించకున్నను దూషించబడరుఅనిబృహస్పతియువ్యవస్థల

నేర్పరచి యుండుటచేత అట్టి కాలములయందు తప్ప యితర కాలముల యందు స్వస్థావస్థలో అస్పృశ్యత పాటించియే తీరవలెను. బ్రాహ్మణాదులు వారి వారి స్వధర్మము ప్రకారము ఆచరించుటలేనే యికను అస్పృశ్యతతో మాత్రము ప్రయోజనమేమి? దీనినితొలగించకూడదా? యనుట సరికాదు. వ్యావహారికమునందు ప్రభువు తన ఆజ్ఞావ్యతిరేకులయిన దుర్మార్గులను యెట్లు శిక్షించునో అట్లే పారమార్థికమునందును ఈశ్వరుడు తన ఆజ్ఞావ్యతిరేకులయిన దుర్మార్గులను శిక్షించును. మరి కట్టుబాట్లలోనేమి, రాజకీయ వ్యవహారములలోనేమి, వారలలోవారలు పరస్పరము బోధించుకొని శాస్త్రనియమబద్ధులుగా నుండుట క్షేమము గాని కొన్ని అక్రమములు చేయుచున్నవారని తెలిసియు తిరుగ కొన్ని అక్రమములు చెయ్యుమని బోధించుట న్యాయముకాదు. స్పర్శదోషము పాటించనక్కరలేదని చెప్పువారు సహితము ఈ సృష్టిలో కొన్ని అస్పృశ్యములు లేవని చెప్పజాలరు గనుక యథాశక్తిగా శాస్త్రనియమములను యెంతవరకు పాటించగలిగిన అంత మేలును పొందగలరు. సనాతన మత వ్యతిరేకియైన ఆర్యమతస్థాపకుడగు శ్రీ దయానందస్వామిచే సగాసత్యార్థ ప్రకాశికలో చండాలుర శరీరములు దుర్గంధపరమాణువులతో నిండియుండుననియు చండాలాది నీచులచే దినగూడదనియు పవిత్ర పదార్థములనే భక్షించు బ్రాహ్మణ బ్రాహ్మశరీరములు వలన దోషరహితములగు రజవీర్యములు పుట్టుననియు వ్రాయబడి యుండెను. దానిని బట్టి పవిత్ర పరమాణువులు గల బ్రాహ్మణాదులు దుర్గంధ పరమాణువులు గల చండాలాదులను తాకగూడదని వేరే చెప్పవలయునా? తత్వజ్ఞాన సమాజమువారు పవిత్రాపవిత్ర తేజస్సులు కలవనియు, పవిత్ర తేజస్సు గల వారలు అపవిత్ర తేజస్సుగలవారలను సమీపించిన యెడల దుష్టతేజస్సు సంక్రమించుననియు తేజస్సునకు ఆకర్షణశక్తికలదనియు చెప్పియుంసిరి. అందువలనసహజఅపవిత్రులయిన సదా అపవిత్ర పదార్థ భక్షణాదులు చేయుచు దుష్టతేజస్సుగల చండా

లాదులను సమీపించకూడదని స్ఫురించుటలేదా? శ్రీ గాంధీగారు జన్మించియుండిన జైనమతములో గూడ అస్పృశ్యత పాటించినట్లును తాము 12 సం॥ రముల వయస్సు కలిగినప్పుడు చండాలురను స్పర్శించినపుడెల్ల తల్లిగారు సచేలస్నానము చేయించుచుండెననియు యంగు యిండియా పత్రికలో వ్రాసుకొని యుండుటచే జైనమతములో కూడ అస్పృశ్యత పాటించినట్లుండలేదా? శ్రీ శివనాథశాస్త్రి యమ్. ఏ., గారు విరచించిన బ్రహ్మసమాజ చరిత్ర సంపుటము 1 పుట 39 లో నుండి సంగ్రహించి 1932 సంవత్సరము జనవరి 2 తేదీని త్రిలింగ పత్రికలో బ్ర. కా. బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసియుండిన ప్రకారం బ్రహ్మసమాజస్థాపకుడగు శ్రీరామమోహన్ రాయిగారు కూడ వేదపఠన మందిరములోనికి బ్రాహ్మణేతరులు యెవరును ప్రవేశించ గూడదని చేసిన యేర్పాటునుబట్టిచూడగా అస్పృశ్యత పాటించియే యున్నట్లు తెలియుటలేదా? పైనఉదహరించిన ప్రకారము యితరమతముల లో కూడ అస్పృశ్యత పాటించియున్నట్టి సూచనలుండగనున్నూ, సృష్ట్యాది నుండియిప్పటివరకు సనాతనాచార ప్రకారం ఆచరణలోనుండగనున్నూ, శృతి స్మృతి పురాణాదులలో చండాలాదులస్పర్శకూడదని ఘంటాపధముగా నిర్ణయించబడియుండగను, ఆచండాలాదులలోనేవారలలోవారలు యిప్పటికిని అస్పృశ్యతపాటించుచుండగను, ఆచండాలురలోనే బహుమంది మాకు దీనివలన ప్రయోజనములేదని వాదించుచుండగను యిట్టివాటి నన్నిటిని గమనించక త్రోసివైచి తమ స్వేచ్ఛాప్రకారము అస్పృశ్యతా నివారణము చేయుడని ప్రచారముచేయువారిని మత ద్రోహులందురో, మత సంస్కర్తలందురో పాఠకులే గ్రహించుకొందురు గాక. 'యస్మిన్ దేశేయదాచారః పారంపర్యక్రమాగతః, శృతి స్మృత్యవిరోధేనసస్సదాచారస్సఉచ్యతే' అను ప్రకారం శృతిస్మృతులకు విరోధములేనిదిన్ని పారంపర్యక్రమాగతముగా వచ్చునదిన్ని యేయేదేశములందు యేది శిష్టాచారముగ పెద్దలచే ఆచరించబడుచున్నదో నదియే

శ్రేష్ఠమయిన ఆచారమని చెప్పబడుచున్నది. గనుక చండాల స్పర్శ సనాతనాచార విరుద్ధము. పైనవ్రాసిన అనేక సంగతులను బట్టి అస్పృశ్యత కలిగియుండుటచే ఈప్రపంచసృష్టిలో స్పృశ్యాస్పృశ్యములు కలవు.

రూపమును గురించి.

రూపము అనగా ఆకారము. నేత్రేంద్రియముచే దర్శించతగినది. సూర్యాదిజ్యోతిర్గణములను పూజ్యమయిన దేవతామూర్తులను సత్పురుషులను, సాధువులను శ్రోత్రియుని స్మార్తశ్రౌతాగ్నులను తులసి అశ్వత్థాది పవిత్రవృక్షములను గోవులను పుణ్యనదులు మొ. వాటిని దర్శించిన పుణ్యము కలుగును' 'శ్లో. అగ్నిచిత్ కపిలాసత్రీ రాజాభిక్షుర్మహోదధిః, దృష్టమాత్రాపునంత్యేతే తస్మాత్పశ్యేతనిత్యశః' అని మనువచనానుసారము యజ్ఞము చేసినవానిని, నల్లనియావును, నిరతాన్నదాతను, ధర్మతత్పరుడునైన రాజును, సన్యాసిని, సముద్రమును వీటిని చూచిన మాత్రముననే పవిత్రులను జేయునట్టివి గనుక నిత్యమును దర్శించవలెను. మనోహరమయిన చిత్తరువులను పుష్పఫలాదులను చూచిన నేత్రానందమున్ను సంతోషమున్నూ కలుగును. 'రోచనం చందనం హేమం మృదంగం దర్పణంమణిం, గురుమగ్నించ సూర్యంచ ప్రాతఃపశ్యేత్సదాబుధః' అను మత్స్యపురాణవచనానుసారము, గోరోజనము, మంచిగంధము, బంగారము, మద్దెలను, అద్దమును, మణులను, గురువును, అగ్నిని సూర్యుని ప్రాతఃకాలమందు దర్శించుటమంచిది. అంగవైకల్యుని, ముక్కిడి, దుర్మార్గుని, ప్రసిద్ధపాపిష్టుని, అంధుని, నిద్రలేవగనే ప్రాతఃకాలమందు దర్శించకూడదు. దిగంబరుని, దిగంబరస్త్రీని, కామేచ్ఛచే వారస్త్రీలను చూడకూడదు. నీటిలోతననీడను చూచుకొనగూడదు. తనభార్యను ఆవలించుచుండగను, కాటుకబెట్టుకొనుచుండగను, అభ్యంగనము చేయుచుండగను ప్రసవించుచుండగను చూడకూడదు. ఘోర వ్యాఘ్రాదులను జూచిన భయమును దుఃఖమును

కలుగును. స్త్రీపురుషులలో యెవరయినను యితరులు దర్శించవచ్చినప్పుడు తమముఖవిలాసము చూపవలయునేగాని గుహ్యాంగములు మొ. చూపకూడదు. పైన ఉదహరించిన దృష్టి మూలములయిన స్పర్శచే పవిత్రాపవిత్రములు కలవు. వీటినే వీక్ష్యములు అవీక్ష్యములు అని గ్రహించవలెను.

రసమును గురించి.

రసము అనగా జిహ్వేంద్రియముచే అనుభవించబడు ఓషధులు మొదలయినవి. అవి తీపి, పులుసు, కారము, వుప్పన, చేదు, వగరు అను షడ్రసయుక్తములైనవియు ఓషధీసంభవమైనవి యయియున్నవి. అట్టిఓషధులను గురించి విచారించగా మృతులయినవారిని సగాజీవింప జేయగలిగిన సంజీవి మొదలయినవికలవని రామాయణములోను శరీరము తూట్లుపడునట్లు యుద్ధముచేసినను మరునాటికే యధాస్థితిగా నుండునట్లుచేయు ఓషధులు కలవని శ్రీ మహాభారతములోను ప్రమాణములుకలవు. ఆయుర్వేదములో చెప్పిన ప్రకారము కొన్నిఓషధులు సేవించిన చిరంజీవిత్వము కలుగునవియు కలవు. సోమలత, బోడతరము మొదలగు వివిధరోగ నిర్మూలనముచేసి కాయసిద్ధిని కలుగజేయునవియు అంజూరపండు ద్రాక్ష మొదలగురక్తవృద్ధినికలుగజేయునవియు వుసిరికాయ, గుంటకలగర మొదలగు మేధాశక్తిని కలుగజేయునవియు సరస్వతిఆకు, వస మొదలగు వాచాలత్వమును గలుగజేయునవియు నాగముషిణి, తెల్లజిల్లేడు మొదలగు సర్పవిషమును సగా హరింపజాలినవియు భూశర్కరదుంప, రత్నపురుష, పెద్దపల్లేరు మొదలగు వీర్యవృద్ధికరములుగను, ఉమ్మెత్త మొదలగు పిచ్చిని గలుగజేయునవిగను వుల్లిపాయ, కల్లు, మొదలగు బుద్ధి భ్రంశమును కలుగజేయునవిగను నాభి మొదలగు ప్రాణాపాయకరములుగను నున్నవి. గోధుమలు, యవలు, వడ్లు పెసలు మొదలగు సాత్వికగుణమును కలుగజేయునవిగను, మొక్కజొన్నలు, జొన్నలు, చోళ్ళు, ఆళ్ళు, కొర్రలు, మొదలగు రజోతమో గుణములను కలుగజేయునవిగను, యింకను వివిధములుగానున్న ధాన్య

ములు, కాయలు, పండ్లు, దుంపలు మొదలగు వివిధగుణములు కలుగ జేయునవియు అనేకములుకలవు. మరియు బంగారము వజ్రవైడూర్యాది నవరత్నములు భస్మాదులమూలముగా భక్షించుటచే సర్వరోగనివృత్తాల నమై అధిక తేజోవంతులును పవిత్రులును అగుదురు. యింకను తబిసీళ్ళు తెలియగోరువారు అందుకు యేర్పడిన గ్రంథములు చూడనగును. యిట్టి వివిధములుగా నున్న ఓషధులు మొదలయినవాటిలో మంచి చెడ్డలు, పవిత్రాపవిత్రములు కలవు. యెట్టి పదార్థానుభవము చేసిన మనో జ్యోతిప్రకాశము అట్టివిధముగా మారును. శృతి ఛాందోగ్య ములో 'అన్నమసితం త్రేధావిధీయతే, తస్యయస్థ విష్ఠోధాతు స్తత్పురీషం భవతి, యోమధ్యమస్తన్మాగ్సం యోణిష్ఠ స్తన్మః, అనగా జిహ్వేంద్రి యముచే భుజించబడినఆహారము మూడువిధములుగా భాగించబడి అందుస్థూలాంశము పురీషముగను మధ్యమాంశము మాంసముగను సూక్ష్మాంశము మనస్సుగను పరిణమించుచున్నదని తేలుచున్నది. గనుక పవిత్రపదార్థములు అనుభవించిన యెడల మనోజ్యోతిప్రకాశము పరి శుద్ధ తేజోవంతముగను అపవిత్ర పదార్థానుభవమువలన అపరిశుద్ధ తేజో వంతముగను మారునని స్పష్టపడుచున్నది. మనుష్యులచే భుజించబడు ధాన్యాదులు సంపాదించునప్పుడు అనేకజీవహింసాపూర్వకముగా సంపా దించక తప్పనివగుటచేతను శ్లో. 'వృక్షాంఛిత్వా మహీంభిత్వా హత్వాతు క్రిమికీటకాన్, కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే' అనుప్రకారము వ్యవసాయదారుడు వృక్షాదులు నరుకునప్పుడున్ను, భూమిని దున్నునప్పుడున్ను అనేకములయిన చీమలు, కప్పలు యర్రలు మొదలయినప్రాణులు చంపబడకుండ తప్పని వగునట్టిపాప మును ఖల యజ్ఞము అనగా ధాన్యాదులను పండించినపిమ్మట కళ్ళము లోనికివచ్చి యాచించినవారలకు ధాన్యాదులను దానము చేయుట చేతను ఆదోషమును పోగొట్టుకొనవలెను. అటుల సంపాదించబడిన ధాన్యాదులను సగా తిరిగి భుజించ యోగ్యముగ చేయుటకుగాను

వాటిని ఖండినీ, పేషిణీ, చుల్లి, ఉదకుంభీచ మార్జని అనుపంచసూనదోషములు అనగా తరుగుట, నూరుట, ప్రొయ్యిమీదనుంచి ఉడకబెట్టుట, నీటికొడవలుంచుట, ఊడిచి అలుకుట అను అయిదువిధములయిన హత్యాదోషములను పోగొట్టుటకుగాను అన్నసంస్కారద్వారా ఆత్మ సంస్కారార్థము, దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్యయజ్ఞ బ్రహ్మయజ్ఞములను పంచయజ్ఞములను వైశ్వదేవాదులున్నూ ప్రతి దినమున్నూ ద్విజాతులుచేసి భ. గీ. అ. 3 శ్లో. 13 'యజ్ఞశిష్టాశిన స్సంతోముచ్యంతే స్సర్వకిల్బిషైః' అను ప్రకారము అట్టి యజ్ఞ శేషమగు పదార్థమును భుజించుటచే సర్వపాప పరిహారకమై క్రమక్రమముగా పవిత్రులగుచుందురు. ప్రాణులలోసంచరించు ప్రాణవాయువు వాటివాటి వృత్తిభేదమునననుసరించి ప్రాణాపాన వ్యానోదాన సమానములను పంచప్రాణములకు తృప్తికలుగజేయుట మూలముగా తేజస్కాముడగుటకు వేరువేరుగా జిహ్వయందు అయిదుఆహుతులను ఆజ్య సహితమగు హవిస్సునుంచుటయును పవిత్రస్పర్శచే "సర్వక్రతుయాజి నామాత్మయాజి విశిష్యతే" అను ప్రకారము తాను అన్నిక్రతువులు చేసినంతటి పవిత్రుడగుటయేగాక శ్రుతిఛాంధోగ్యము పంచము ప్రపాఠకము చతుర్వింశతిఖండః ద్వితీయానువాకము "అథయ ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి, తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మసు హుతంభవతి" అనుప్రకారము సర్వలోకములలం దుండునట్టిన్ని సర్వభూతములందుండునట్టిన్ని సమస్త ఆత్మలయందును పవిత్రతేజోవృద్ధి యగునటుల హోమము చేసినట్లగును. శూద్రులున్ను వేదమంత్రోచ్చారణరహితముగా పంచయజ్ఞాదులు చేయవలయును. యిట్టి అనేకవిధములయిన యజ్ఞాదులలో యేదయినను చేయకుండ ద్విజాతులు భుజించరు గనుక అట్టి యజ్ఞశేషమగు పదార్థము యితరులు భుజించిన్ని పవిత్రులగుదురు. గనుకనే పవిత్రులయినవారి చేతిఅన్నాదిపచనపదార్థ భక్షణచేయుటచే క్రమక్రమ పవిత్రవంతులుగ

జేయును. అట్లు పవిత్రతకొరకు పైనవివరించిన యజ్ఞాదుల నేమియు జేయక స్వేచ్ఛగా అన్నాదిపదార్థములను భుజించువారలు "భుంజతేతే త్వఘంపాపాయే పచంత్యాత్మకారణాత్" కేవల తమదేహపోషణార్థము మాత్రమే నుపయోగించునటుల పచనాదికముచేసి భుజించువారలు పాప మునేభుజించువారగుచున్నారు. అనగా అపవిత్రులయిచెడుచున్నారు. భ. గీ. అ. 4 శ్లో. 31 'నాయం లోకోస్త్య యజ్ఞస్యకుతోన్యః కురుసత్తమ' అను ప్రకారము పై జెప్పబడిన యజ్ఞకర్మలలో నొకటియును జేయని వానికి ఈలోకములో సయితము సౌఖ్యముగలుగదు. అట్టివానికి పరలోకప్రాప్తి యెక్కడిది? అనగా లేదనుట. జిహ్వేంద్రియముచేననుభవించుస్వభావ దుష్టములగు తమోగుణ పదార్థములను సంస్కారదుష్టములగు పంచ యజ్ఞాది రహితముగను భుజించిన అపవిత్రులయి క్రమక్రమముగా చెడుదురు. సర్వసములైన బ్రహ్మజ్ఞానులయినసన్యాసులు సగా సన్యా సోపనిషత్ శ్రుతి. 'అభిశస్తంచ, పతితం, పాషండం, దేవపూజకం, వర్జ యిత్వాచరేద్భైక్షం, సర్వవర్ణేషుచాపది.' అను ప్రకారము, ప్రసిద్ధవ్య భిచారులు, పాపిష్ఠులు, పాషండులు, దేవపూజకులైన పూజారులు మొదలగువారివద్ద భిక్షగొనగూడదు. అనగా అట్లు భిక్షగొనిన అపవి త్రులగుదురు. ఆపత్కాలమందుమాత్రమే అన్నివర్ణములయందు భిక్ష గొననగును. కేవల తత్వజ్ఞానులు యోగాభ్యాసకులు సగా "యుక్తా హారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు" అనుప్రకారము కేవలసాత్వికా హారభక్షణనియమమునే చేసినయెడల పవిత్రులగుచుందురు. కనుక పైనవ్రాయబడిన అనేకవిషయములనుబట్టి విమర్శించగా జిహ్వేంద్రి యుచే ననుభవించు రసాదులలో పవిత్రాపవిత్రములు భక్ష్యాభక్ష్యము ములుకలవని రూఢియగుచున్నది.

### గంధమును గురించి.

గంధము అనగా ఘ్రాణేంద్రియముచే శ్వాసమూలముగా గ్రహిం చతగిన వాసనలుగా నున్నవి. ఘ్రాణేంద్రియముద్వారా జరుగు ప్రాణ

వాయుసంచారమును రేచకపూరక కుంభకములచే నియమించుటయే ప్రాణాయామమనబడును. దర్శనోపనిషత్ శ్రుతి. 'రేచకం పూరకం ముక్త్వా కుంభకం నిత్యమభ్యసేత్, సర్వపాప వినిర్ముక్తః సమ్యగ్జ్ఞానమవాప్నుయాత్. మనోజవత్వ మాప్నోతి ఫలితాదిచ నశ్యతి, ప్రాణాయామైక నిష్ఠస్యనకించిదపి దుర్లభం, తస్మాత్సర్వప్రయత్నేన ప్రాణాయామాన్ సమభ్యసేత్. అనుప్రకారము ప్రాణాయామమును నిత్యము అభ్యసించువానికి సమస్తపాపములు పోగొట్టబడి శ్రేష్ఠమయినజ్ఞానము కలుగుటయేగాక దుర్లభమయిన కార్యమెద్దియు లేకుండును.

చందనము, కర్పూరము, కస్తూరి, మల్లె, గులాబి మొదలగు పుష్పవాసనలు ఆరోగ్యములుగను సువాసనలుగను పవిత్రవంతములుగను వుండును. పుల్లిపాయ, గంధకము మొదలగువాటి వాసనలు కేవల దుర్గంధములగు మలమూత్రాదిదుర్వాసనలు, అనారోగ్యకరములుగను, అపవిత్రములుగను వుండును. అపవిత్రుల ఉచ్ఛ్వాస నిశ్వాసవాయువులు అపవిత్రములుగానుండును. క్లోరోఫారం మొదలగు కొన్నివస్తువులు మూర్ఛనిన నిశ్చేష్టితులగుటయు ఒకానొకప్పుడు ప్రాణాపాయముకూడ సంభవించుటయు గలదు. గనుక ఆఘ్రాణములో పవిత్రాపవిత్రములు, ఆఘ్రాణములు, అనాఘ్రాణములు కలవు.

పంచేంద్రియ విషయంబులైన, శబ్ద, స్పర్శ, రూప, రసగంధంబులలో మంచిచెడ్డలు, పవిత్రాపవిత్రములు కలవని నిరూపించబడెను. సనాతనధర్మశాస్త్రము లన్నియు దేహము పవిత్రవంతముగా చిరకాలము నిల్చుటకుగాను ఇంద్రియములను నియమించుటనే బోధించును. ఉ. గీ. శ్లో. 'ఇంద్రియాణాం నిరోధేన దేహాపశ్యంతి మానవాః, దేహేనష్టే కుతోబుద్ధి బుద్ధినాశేకుతోజ్ఞతా.' ఇంద్రియములను నియమించుటచేతనే ఈదేహమును ఆరోగ్యవంతమైనదానినిగా చూచుచున్నవారు. దేహము చెడిపోయినయెడల బుద్ధియెక్కడిది? బుద్ధినశించినయెడల తెలుసుకొనుటదేముండును?

కర్మేంద్రియములగు వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థ, లచే
చేయబడు పనులనుగురించి.

వాక్కు అనగా నోటవచించు శబ్దములు సుస్వరముగాను, మృదువుగాను, భగవద్విషయములుగాను నిజమును తెలుపునవిగను ఉచ్చరించునవి మంచివిన్ని పవిత్రములున్నూ అగును. అపస్వరములుగను కఠినాక్షరములుగను లోకనిందాపరములుగను యితరులను కపటముతో మోసగించునవిగను, అనృతములుగను విషయలోలతను బోధించునవిగను ఉచ్చరించబడు శబ్దములు చెడ్డవిన్ని అపవిత్రములున్ను అగును.

పాణి అనగా చేతితో చేయుపనులు అనేకములుగానున్నవి. వాటిలో ప్రధానము స్పర్శగానున్నది. పవిత్రముగా నెన్నబడిన శిలా వృక్ష జంతుమనుష్యాదులను తాకుట పూజించుట మొదలగునవి పవిత్రములు, సద్గ్రంథములు వ్రాయుట, చిత్తరువులు వ్రాయుట, అనేక చిత్రవిచిత్రములైన గృహములు వాపీకూప తటాకాదులు నిర్మించుట, ఈశ్వరపూజ దానధర్మములుచేయుట,మంచివి పవిత్రకార్యములు. అపాత్రగ్రంథములు వ్రాయుట, వాపీకూపతటాకాదులు పాడుజేయుట, కత్తులు, కర్రలు మొదలయినవాటి సహాయముతో యితరులకు అనేక విధములయిన హింసలు కలుగజేయుట, పవిత్రతేజస్సుకు భంగము కలుగులాగున అమేధ్యమును అమేధ్యభక్షణ చేయునట్టి శునక, శూకర గార్దభాదులున్నూ అనాదినుంచి అపవిత్రులుగానున్న చండాలాదులను తాకుట మొదలగు చెడ్డవిన్ని అపవిత్రములున్నూ అయియున్నవి.

పాదములతో సంచరించుటలో పుణ్యక్షేత్రములు, దేవతలు, పెద్దలు ధర్మపరిపాలన చేయురాజును దర్శించుటకు వెళ్ళుటమంచివి. పవిత్రములు, జారత్వ చోరత్వములకు జేయుసంచారము యితరదుర్మార్గకార్యములకు సంచారము అపవిత్రస్థల సంచారము గోబ్రాహ్మణ హానికొరకు సంచారమున్నూ చెడ్డవిన్ని అపవిత్రములు.

పాయురింద్రియము మలవిసర్జనాత్మకమైనది. గ్రామబహిః ప్రదేశములయందును, యితరులకు చెరుపులేని దూరప్రదేశములందును, రహస్య స్థలములయందును, మలవిసర్జన చేయుట మంచిది. దేవాలయములు, నదీతీర సమీపములందును, మార్గములందును, యితర పవిత్రస్థలముల యందును మలవిసర్జనచేయుట చెడ్డయున్నూ అపవిత్ర కార్యమున్నూ అగును.

ఉపస్థఅనగా స్త్రీపురుషజన నాధారమయిన గుహ్యేంద్రియము. యోగ్యమయిన సజాతీయమైన సత్సంతానము బడయుటకు తగిన శాస్త్రీయమయిన విధానముగా వివాహబంధముతో నున్నవారలు సంగమించుటయు ప్రశోన్నపని షత్ శ్రుతి. ఏతే ప్రస్కందంతియే దివార త్యాసంయుజ్యంతే, బ్రహ్మచర్యమేవ తత్య(దాతే) రత్యాసంయుజ్యంతే అను ప్ర. పగలు స్త్రీసంభోగము చెయ్యక రాత్రులయందు మాత్రమే చేయుట పవిత్రవంతముగ నున్నది. సత్సంతానము బడయుటకు మాత్రమే ఈ మొదలయిన నియమములు శాస్త్రములయందు నిర్ణయించ బడియున్నవను జ్ఞానము లేశము లేక పశువులకంటెను అక్రమముగా నియమాతిక్రమణముగా సంగమించుట అపవిత్రము. అందువలన హిరణ్యాక్ష హిరణ్యకశిపులవలెను రావణ కుంభకర్ణాదులవలెను లోకకంటకులైన దుర్మార్గసంతానము కలుగును. ఇందునుగురించి ముందువిపులముగా వివరించబడును.

ఇంతవరకు విమర్శించిన సంగతులవలన సమస్తజీవులు సర్వేంద్రియములద్వారా అనుభవించు పంచభూతములలోను వాటివల్లనే యుత్పత్తియైన ఓషధులలోను పంచతన్మాత్రలగు శబ్ద, స్పర్శ, రూప, రసగంధంబులలోను వాక్కు, పాణి, పాద, పాయూపస్థలగు కర్మేంద్రియముల వృత్తులలోను మంచి చెడ్డలు, లేక పవిత్రాపవిత్రములు కలవని నిరూపించబడెను. యిందుల ప్రయోజనమేమనగా పవిత్రపదార్థానుభవమువలన పవిత్రవంతులుగను అపవిత్రపదార్థాను భవమువలన

అపవిత్రులుగనునుందురనియు పవిత్రపదార్థములకు అపవిత్రపదార్థ స్ప ర్శాదులచే నెట్టిఅపవిత్రతగనుండునో అట్లే పవిత్రపదార్థానుభవముగల బ్రాహ్మణాదులకు అపవిత్రపదార్థానుభవముగల ఛండాలాదులస్పర్శము వలన అపవిత్రతకలుగుననిగ్రహించతగియుండును. పైనవివరించినప్రకారం ఇంద్రియవృత్తుల ద్వారా యెంతవరకు పవిత్రపదార్థానుభవము చెయ్య గలిగిన నంతవరకు పవిత్రుడగును. "వశేహియస్యేంద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా" అను గీతావచనము ననుసరించి యెవనికి యింద్రియ ములు స్వాధీనములై యుండునో వానియొక్క ప్రజ్ఞయే స్థిరగౌరవనీయ ముగానుండును. ఈ ప్రపంచములోనుండు సర్వవస్తువిభాగమును ఉత్త ము, మధ్యమ, అధమ నిర్ణయరూపమయిన భ. గీ. 14 అ 5 శ్లో॥ సత్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతిసంభవాః అనియు 18 అ 40 శ్లో॥ నతదస్తి పృథివ్యాం వాదివిదేవేషువాపునః, సత్వం ప్రకృతి జైర్ము క్తం యదేభిస్యాత్రిభిర్గుణైః, అను ప్రకారము సత్వగుణము, రజో గుణము, తమోగుణము అనియు సమస్తపదార్థములు విభజింపబడి యు న్నవి. మరియు యిట్టివిభాగమునకు లోబడనివస్తువు ఈభూమియందు గాని స్వర్గమునందుగాని దేవతలయందుగాని లేదు. ఆ విభాగము పాఠ కుల సౌకర్యార్థము 1 వ తరగతి, 2 వ తరగతి, 3 వ తరగతి అని గ్రహించవచ్చును. యిదివరలో పంచభూతాదులు మొదలగువాటి విమర్శలో యోగ్యములనియు, పరిశుద్ధములనియు మంచివియనియు పవిత్రములనియు వాడబడినవన్నియు ఒకటవతరగతికి చేరిన ఉత్తమ మయిన సాత్వికపదార్థములనియున్నూ, అయోగ్యములనియు, అపరి శుద్ధములనియు, చెడ్డవియనియు అపవిత్రములయినవనియు వాడబడిన వన్నియును 2, 3 తరగతులకు చేరిన మధ్యమ అధమమయిన రాజసతామస, పదార్థములనియున్ను గ్రహించవలయును. ఈదేహికి సాత్విక పదార్థానుభవములో భ. గీ. 14 అ 6 శ్లో. తత్రసత్వం నిర్మ లత్వాత్ ప్రకాశకమనామయం, సుఖ సంగేన బధ్నాతి జ్ఞానసంగేన

చానఘు. సత్వగుణము స్వచ్ఛమైనదియు నిర్మలముగా ప్రకాశించు నదియు ఉపద్రవరహితము అయియున్నది. సత్వగుణము జీవుని సుఖము తోనున్నూ జ్ఞానముతోనున్నూ జేర్చుచున్నది. గనుక సాత్వికపదార్థానుభవమువలన పవిత్రులగు చుందురు. ఈదేహమునకు పవిత్రాపవిత్రములతో ప్రయోజనమేమి? ఆత్మఅంతయు సమానమేనని తలంచ కూడదు. శ్రు. ఉపాధినానాత్వాత్, ఆత్మనానాత్వం అను ప్రకారం వివిధభూషణరూపముగానున్న బంగారము అని సామాన్యముగా వాడబడుచున్నను వాటివాటివన్నెనుబట్టి పరీక్షించి కొన్నికొన్ని పుటములు వేసిననే తిరిగి మేలిమి బంగారములో చేర్చదగును. అట్లే భ. గీ. 5 అ-15 శ్లో. అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యంతిజంతవః 16. జ్ఞానేనతుతదజ్ఞానం యేషాంనాశితమాత్మనః, తేషామాదిత్య వద్జ్ఞానం ప్రకాశయతి తత్పరం. ఈ యాత్మనునురించియున్న జ్ఞానము, అజ్ఞానములేక అవిద్య, మాయయనుదానిచే నావరించబడి అవివేకులయిన సంసారులను మోహింప జేయుచున్నది. అట్టిఆత్మ వినాశకరమైన అజ్ఞానమును జ్ఞానము చేతను నశింపజేసినపిమ్మటనే సూర్యప్రకాశమువలె ఆత్మ ప్రకాశింప జేయును. అవిద్యాసహితుడైన ఆత్మయే జీవుడనబడును. అవిద్యానివృత్తియొక్క న్యూనాధిక తారతమ్యవ్యవస్థను బట్టియే అధమ, మధ్యమ, ఉత్తమ జన్మలు కలుగుచుండును. అవిద్యానివృత్తికొరకు సర్వేంద్రియములద్వారా సాత్వికపదార్థానుభవముచే ఈ స్థూలదేహమును సదాపవిత్రముచేయుచుండిన సూక్ష్మదేహము పవిత్రమగును. సూక్ష్మదేహము పవిత్రమయిన కారణదేహము పవిత్రమగును. శ్రుతి. హృదంతర్జ్యోతిపురుషః అనుప్రకారం హృదయాంతర్గతుడగుమనోజ్యోతిస్వరూపుడైన జీవుడు యెంతటి సాత్విక తేజోశక్తిని సంపాదించగలిగిన అంతటి జ్ఞానాధిక్యముగల సాత్వికజన్మలుపొందును. భిక్షాధికారి మొదలు లక్షాధికారియు ప్రభువువరకున్నూ న్యూనాధిక తారతమ్యదశాయున్నూ సౌఖ్యమున్న అనుభవించుటకు "ధనమూల మిదం

జగత్” అనునట్లు ఈ ప్రపంచములో ధనమే ప్రధానముగానున్నది. అట్టిధనమును న్యాయార్జితముగా సంపాదించుటలో ఈదమ్మిడియేకదా, ఈకానియేగదాయని నిరసించక సంపాదించి వృద్ధిచెయ్యవలెను. ఆవృద్ధి చేసిన ధనములోనుంచి అత్యవసరమైన ఖర్చునేతప్ప యితర దుర్వ్యాపారములకు లేశము ఖర్చుపెట్టకనున్నా ఆఖర్చుపెట్టునప్పుడున్నా ఈదమ్మిడేగదా, ఈకానియేగదాయని నిరసించక జాగ్రత్తగా నిలవ చేసినచే ద్రవ్యవృద్ధిన్ని అందువల్ల సౌఖ్యమున్నూ పొందును. అదేవిధముగా తాను ఉన్న జన్మకంటె ఉత్తమమయిన జన్మగాని స్వర్గాదిభోగములుగాని యింద్రాది దేవతాజన్మలుగాని తుదకు మోక్షముగాని పొందగోరువారందరు సాధ్యమయినంతవరకు శక్తిలోపములేకుండా ఈదేహమును సదా పవిత్రము చేయుచుండుటకు ముఖ్యసాధనమైన ప్రాణశక్తిని విద్యుత్తున్ను, పవిత్రశక్తిని లేక పుణ్యమును అను పర్యాయపదములచే వాడదగిన సాత్విక తేజోశక్తిని సర్వేంద్రియముల ద్వారా శృతిస్మృత్యాది ధర్మశాస్త్రవిధిననుసరించి సంపాదించుచుండవలెను. అట్లు పుణ్యముసంపాదించుటలో స్వల్పాంశమునగా వదలక పాపలేశము దొర్లనీయక పుణ్యము వృద్ధిచేసుకొనుచుండవలెను. పాపలేశమువల్ల కొంతపుణ్యము తగ్గిపోవుచుండును. ఈ దేవతా దర్శనమువలన వచ్చునది స్వల్పపుణ్యమే గదాయనియు చండాలులను ఒకసారిస్పృశించిన వచ్చునది స్వల్పపాపమేగదా యనియు నిరసించక జాగ్రత్తగా మరణపర్యంతము పుణ్యమును లేక సాత్విక తేజోశక్తిని వృద్ధిచేసుకొనుచుండవలెను.

ఈ ప్రపంచములో ధనము సంపాదించుటకు హింసా, చోర, వ్యభిచారాదులచే సంపాదించు ద్రవ్యజీవనులు మొట్టి నిందనీయులుగనుండురో అట్లే పరలోకసాధనకు ఈశ్వరాజ్ఞలగు శృతిస్మృత్యాదులలోని విధివిధానముకు వ్యతిరేకముగా మొట్టి సాత్వికశక్తిని లేక పుణ్యమును సంపాదించువారైనను నిందనీయులే యగుదురు.

మరణానంతరము - ఉ॥ గీ॥ 1అ 49శ్లో॥ ధర్మాధర్మౌమన శ్చైవ పంచభూతానియానితుఇంద్రియాణిచపంచైవయాశ్చాన్యాపంచదేవతాః॥ జీవేనసహాగచ్ఛంతి యావత్తత్వం నవిందతి, మనసా సర్వథాతావన్నిత్యమేవాభిమానినః॥అనుప్రకారం ధర్మాధర్మములుమనస్సు మొ॥ యున్నూ జీవోపాధియగు లింగశరీరముతో పోవుచుండును. సనాతన ధర్మశాస్త్ర నిర్ణయమునుబట్టి పూర్వజన్మయు, పరజన్మయు కలవనియు పూర్వజన్మలలో చేసికొనిన పుణ్యపాపకర్మల యొక్క న్యూనాధిక తారతమ్య వ్యవస్థలన దగిన శిలా, తరు, క్రిమి, కీటక, జంతు మనుష్యాదులలో జన్మలు కలుగుచుండుననియు తెలియవలెను. మనుష్యులలో బిచ్చగాడు, కుంటియు, గ్రుడ్డియు, వికలాంగులు మొదలైన హీనజన్మలు కోరుకొనకుండ యెట్లు సంభవించుచున్నవో అట్లె చండాలులుగా బుట్టుటయు పూర్వజన్మ కర్మాను గుణ్యమైన పాపాధిక్యము చేతనే సంభవమైన వేనని గ్రహించక పోవుట అనాలోచనయే యైయున్నది. వీరు చండాలురుగారు, వీరువైశ్యులుగారు, వీరు బ్రాహ్మణులుగారు అని వూహాపోహాలచే నల్లబడిన కుతర్క వాదముల కంటె అనాదినుంచి పారంపర్య క్రమాగతముగా అనుభవములో నుండిన్ని లోక ప్రతీతియున్నూ ప్రత్యక్షనిదర్శనముగా నున్నవి. అస్పృశ్య జాతులు, చండాలురని, అంత్యజులని, పుల్కసులని, మాతంగ, దివాకీర్తి,జనంగమః శ్వపచులని శృతిస్మృతి నామలింగాను శాసనాది నిఘంటులలోను వాడబడి వారివారి నడవడికి దగిన అర్థమిచ్చుచుండుటను బట్టియు నిదర్శనములుగా నున్నవి. పుల్కసుడనగా పెద్దలను స్పర్శచే చెరచువాడనియు, దివాకీర్తిఅనగా పగలు స్మరించ తగనివాడనియు జనంగమః అనగా జనులచే దోలగి పోవువాడనియు మాతంగ అనగా గ్రామమధ్యమును బొందనివాడనియు యీమొదలైన యుత్పత్తి అర్థములచే స్థితిగతులను తెల్పునవిగ నున్నవి. వాటిననుసరించి ఆంధ్రదేశములో చెప్పరానివాండ్లనియు, ముట్టరానివాండ్లనియు, పంచములనియు మాలలనియు,

మాదిగలనియు, యింకను వారు వారుచేయు పనులను బట్టి వివిధ నామములతో వాడబడుచును వారలచే చెప్పుకొనబడుచును వున్నారు. వారల మెప్పుగోరువారు కొందరు తమగౌరవాతిశయమును తెల్పుటకు గాను యిదివరలో ఆదిమాంధ్రులని వాడజొచ్చిరి. వారలందరి కంటెను అధిక గౌరవ సూచనార్థము చండాలు రందరిని శ్రీగాంధిగారు హరిజనులని పిలువజొచ్చిరి. అంతటినుండి వ్యాసము లలో పండితులు సగాహరిజనులని విధిలేక వాడజొచ్చిరి. శ్రీ గాంధిగారు హరిజనులని అందరికి సమానముగా నామకరణము చేయు టయేగాని వారలలో వారలకుండుఅస్పృశ్యతను తొలగించ జాలకపోగా యితరచాతుర్ వర్ణ్యులను మాత్రమువారిని తాకుడని నిర్బంధ ప్రచా రముచేయుచు అట్లు చెయ్యనివారిని శిక్షించుటకుగాను ప్రభుత్వశాసన ములు చేయించుటకు కూడ భగీరథ ప్రయత్నములు చేయుచున్న వారు. యిది యెట్టి అహింసా తత్వమో వూహించ వీలులేదు. శ్రీగాంధి గారు వాడిన హరిజనశబ్దములో హరియనగా విష్ణువు అనిఅర్థమును వాడి నట్లు తలంచిననుఆవిష్ణువుసృష్టి చేయునిమిత్తం బ్రహ్మనుసృజించగా చరా చర ప్రపంచము బ్రహ్మచే సృష్టింపబడెను. గానిచండాలురను మాత్ర మే సృష్టించియుండలేదు- అట్లయినను వారలను బ్రహ్మజనమనవలశి యుండును- వారలేగాక అందరును బ్రహ్మజనమే అగుదురు- హరిజన మనగా హరిభక్తులను అర్థమునందు వాడిరనుటకున్నూ వీలులేదు. ఏమ నగా హరిభక్తులు అనుశబ్దము కేవల హరిభక్తి కలవారియందే వాడ బడవలెను గాని అట్లు హరిభక్తిలేని ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్య కశిపుడు మొదలైన వారలయందువాడకూడదు-చండాలురుఅందరు హరి భక్తులనుట సాహసకృత్యము. హరిభక్తులు అన్నిజాతులలోను ఉండ వచ్చును. వారలలో శివకంఠమాలలు, మాదిగలు మొదలయినవారు కేవల శివభక్తులుగానున్నారు- ఒకవేళ హరియనగ కోతికిన్ని అర్థముం డుటచేతను పాశ్చాత్య సిద్ధాంతులలో కొందరచే కోతులచే మనుష్యు

లుత్పత్తియైరియను అపసిద్ధాంతముండుటచేతను లేక రాములవారికి రావణ వధార్థము సుగ్రీవాది వానరులు సహాయపడి యుండుటచేతను కోతులను అర్థముక్రింద వాడి సటూహించుటకును వీలు లేదు- యేమనగా వారలు కోతులవలె వర్ణవావ్యులులేకుండ సంచరించువారును స్పర్శ దోషము పాటించని వారు యగారు. వారలలో వారలు మాలలు మాదిగెలు మొదలైన అంతశ్శాఖలలో స్పర్శదోషము తప్పక పాటించు చున్నారు. ఆకోతులలోకూడ నల్లనివి- పచ్చనివి, తోకలేనివి, కొండ ముచ్చులు, మొదలైనఅన్యోన్య భేదములుకలిగియున్నవి. యికను రాముల వారికిసహాయము చేసినసుగ్రీవాది వానరులు దైవాంశా సంభూతులును కామరూప, కామ గమనము గలవారును అద్భుతశక్తిమంతులును, అయి ఉన్నారు. గనుక వారలతో పోల్చుటకు బొత్తుగావీలు లేదు. హరియనగ బొత్తిగా సామ్యములేని కప్ప మొదలయిన వాటిఅర్థమునందు వాడ్క రనుటకు వీలు లేదు. ఒకవేళ శాక్తేయులు, మొదలయిన వామాచార్యు లు కొందరు ఉల్లిగడ్డకు వ్యాసులనియు, తెల్లగడ్డకు శుకదేవులనియు, మద్యపానము చేయువారిని దీక్షితులనియు, వేశ్యాది వ్యభిచరించి భ్రష్టు లగు స్త్రీలను, కాసీవాసిని, ప్రియాగవాసిని, అనియు మద్యమునకు సుజ్ఞానరసమనియు మాంసమునకు మోక్షదవ్యమనియు, మొదలయిన పవిత్రనామములతో గూఢముగా వ్యవహరించునట్లుగా చండాలురి యందు హరిశబ్దమువాడియుండ వచ్చుననుటకున్నూ వీలు లేదు. యేమ నగా చండాలులను హరిజనులని బహిరంగముగా వాడుటచేతను నామ మునందు పవిత్రముండిన పదార్థమందుకూడ పవిత్రముండునా? నేతిబీర కాయ యనిన అందు నెయ్యి యుండునా? యిట్లు యేఅర్థమునందు హరి జనశబ్దము వాడినది నిర్ణయించ సాధ్యముగానిదిన్ని ఆచండాలులలో గూడ బహుమంది యిట్టి మాన్యపద వాచ్యులమైతిమని యిప్పటికిన్ని తెలిసికొని యుండనట్టిన్ని హరిజన శబ్దముకంటె పారంపర్య క్రమాగత ముగా చిరకాలమునుంచిన్ని శ్రుతిస్మృత్యాదులయందు ప్రత్యక్షనిదర్శ

నము అనుభవమున్ను గల యిదివరలో నుదహరించిన అనేక పర్యాయ పదములు చే వాడబడు చండాలురు వీరేయని నిర్ణయించతగియున్నది. యెట్లయనను చండాలురు వీరుగారనునప్పుడు హరిజనులు మాత్రమెట్లగుదురు? సోదరభావము అనుశబ్దమువలెనే హరిజనశబ్దమును ఐకమత్య సాధనకు వాడినామనుటకున్ను వీలులేదు. ఏమనగా? సోదరులలో అందరికి ఐకమత్యముండినగదా సోదరభావము అనివాడుటచే ప్రయోజనముండును? రావణకుంభకర్ణ విభీషణాదులలో విభీషణుడు రాముల వారితో కలసి రావణాదులవధకు తోడ్పడిన సోదరభావమా? సోదరులయిన సుందోపసుందులు తిలోత్తమయను అప్సరస్త్రీ మోహముచే అన్యోన్య కలహముచేసి మరణించిన సోదరభావమా? తీరనివైరము గల సోదరీలగు దితి, అదితిపుత్రులగు దేవరాక్షసుల సోదరభావమా? రాజ్యభాగముకొరకు ఘోరయుద్ధము చేసిన సోదర సంతానమగు పాండవదుర్యోధనాదుల సోదరభావమా? భాగలబ్ధికై స్వల్పద్రవ్యమునకైనను అన్యోన్య హత్యలకు సగా సిద్ధపడు యిప్పటివారిలోని సోదరభావమా? దేనిని ఆధారముచేసుకొని సోదరభావమని వాడుదురో యిదియు అక్లై అయివుండును.

సోదరభావము అని ఐకమత్యసాధన కొరకు వాడుటకంటె మిత్రభావమని వాడుట యోగ్యముగ నుండును. ఏది యెట్లున్నను అన్ని శరీరములలోనిది రక్తమేగదా? యని వాదించుచూ రక్తభేదము లేదనుట సరికాదు. రంగు వకటి అయినప్పటికి రక్తములో గుణభేదము కలదు. ఏమనగా? కేవల సుగంధయుక్తములయిన ఓషధులను మూలికల భక్షించు నట్టియు శ్రీకృష్ణాది అవతార పురుషులున్నూ యితర రాజులున్నూ ధరించ యోగ్యమయినట్టిన్ని బంగారము కంటెను రెట్టింపు విలువగలిగినట్టిన్ని కస్తూరి యుత్పత్తిజేయు కస్తూరి మృగమదరక్తమునకున్నూ సదా అమేధ్యాదులనే భక్షించు పందియొక్క మదరక్తమునకున్నూ భేదముగలదు. మరియు అడవులుకొండలు మొదలైన వాటి

యందే సంచరించుచు సమస్త ఓషధులు మాత్రమే భక్షించునట్టిన్ని యజ్ఞాదుల యందుపయోగించుటకు తగినట్టిన్నీ మేకయొక్క రక్తము కున్నూ సదా అపరిశుద్ధ పదార్థ భక్షణచేయు కుక్కయొక్క రక్తము కున్నూ భేదముగలదు. అదేవిధముగా యివివరలో చెప్పిన వేదప్రమాణము శ్రుతి "పురుషోన్నరసమయః" ననుసరించి జననాది మరణపర్యంతము రజోతమోగుణపదార్థములను సాధ్యమయినంతవరకు త్యజించి సర్వేంద్రియముల ద్వారా సాత్విక పదార్థానుభవమునే అధికముగా పారంపర్య అనుభవించునట్టి సమానజాతీయులైన సాత్విక బీజక్షేత్రోద్భవులయిన స్త్రీ పురుషుల శుక్ల శోణితములవలన జన్మించినట్టిన్ని తను తల్లిదండ్రుల ఫొటోలు అనునట్లుగా ప్రత్యక్షనిదర్శనముగా నున్న స్వరూప గుణాదులలో కొన్నియైనను కలిగియుండిన్ని తిరిగి జననాది మరణ పర్యంతము జీవితకాలములో సర్వేంద్రియములద్వారా సాత్విక పదార్థానుభవమునె అధికముగా చేయునట్టిన్ని బ్రాహ్మణ శరీర రక్తము కున్నూ మరియు జననాదిమరణపర్యంతము సాధ్యమయినంతవరకు సాత్విక పదార్థములను త్యజించి సర్వేంద్రియముల ద్వారా రాజస, తామస, పదార్థములనే అధికముగా పారంపర్యము అనుభవించునట్టి సమాన జాతీయులయిన రాజస, తామస బీజక్షేత్రోద్భవులైన స్త్రీ పురుష శుక్ల శోణితములవల్ల జన్మించినట్టిన్ని తను తల్లిదండ్రుల ఫొటోలు అనునట్లుగా ప్రత్యక్ష నిదర్శనములుగానున్న స్వరూప గుణాదులలో కొన్నియైనను కలిగియుండిన్ని తిరిగి జీవితకాలములో సర్వేంద్రియముల ద్వారా రాజస, తామస, పదార్థానుభవములనె అధికముగా జేయునట్టి క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలాదుల శరీర రక్తముకున్నూ గుణభేద తారతమ్యము లేదని వస్తు గుణానుభవమున్నైనను గ్రహించ గలవారెవ్వరును పలుకజాలరు. గనుక బ్రాహ్మణుల రక్తముకున్నూ తదితరులైన చండాలాదుల రక్తముకున్నూ వంశ పారంపర్యము అనుభవించు పదార్థములనుబట్టి పవిత్రాపవిత్రములగు రక్తభేదముగలదు. పవిత్ర

శుక్లశోణితములకు జన్మించినవారలు పవిత్రులుగను, అపవిత్ర శుక్ల శోణితములకు జన్మించినవారలు అపవిత్రులుగను వుందురని వేరే చెప్ప వలయునా? మరియు అంత్యకాలమునకు అనగా మరణసమయమునకు నిలిచి యుండు దేహముయొక్క స్థితి ననుసరించి బ్రహ్మపురాణె- శ్లో॥ తతశ్చ యాతనాదేహం క్లేశేనప్రతిపద్యతే । తత్కర్మజం యాతనార్థమమాతా పితృసంభవం । తత్ ప్రమాణంవయోవస్థా సంస్థానైః ప్రాక్తనం యథా అనుప్రకారముపూర్వమువుండురూపము, వయస్సుఅవస్థలను కలిగియున్న ట్టిన్ని తల్లిదండ్రులకు జన్మించనట్టిన్ని పుణ్యపాపకర్మలు అనుభవించు టకు యాతన శరీరము కలుగజేయబడును. అట్టి యాతనాశరీరముతో "యామ్యలోకం ప్రపన్నస్య పురుషస్యతథాయమః, యోనిం శ్చనరకాం శ్చైవనిరూపయతికర్మణేతి॥ అనుప్రకారముయమలోకముజేర్పబడి తాను జేసిన కర్మకుదగిన యెట్టి యోనియందు జన్మించవలసినదియు అనుభ వించవలసిన నరకములనున్నూ యమునిచే నిరూపించబడిన నరకాను భవము కాగానే తిరిగి జన్మించును. "తత్రతం బుద్ధి సంయోగం లభతె పూర్వదైహికం" అను గీతావచనప్రకారము తిరిగి పూర్వదేహ సంబంధ మయిన బుద్ధి మొదలైన వాటినే కలిగియుండును. యిట్లు "అనేక జన్మ సంసిద్ధస్తతో యాతిపరాంగతిం॥" అనుప్రకారం అనేకజన్మలయందు జేయబడిన పాపపరిహార పూర్వకమయిన కర్మలచే పవిత్రులై తుదకు మోక్షము నొందుదురు గనుక యేవిధముగా జూచినను ఈదేహమును సర్వకాల సర్వావస్థలయందును సర్వేంద్రియములచేతను పవిత్రము చేయుచుండిననే హృదయాకాశమునందుండు మనోజ్యోతి ప్రకాశము సాత్వికమగు స్వచ్ఛమయిన తెలుపుగా ప్రకాశించును. అందునుబట్టి పవిత్రతేజస్సు వృద్ధియగును. ఈదేహమును ఒకలాంతరకు పోల్చదగి యుండును. వాటిలో తెల్లఅద్దముగల లాంతరు, యెర్రఅద్దముగల లాంతరు, పచ్చఅద్దముగల లాంతరు నల్లఅద్దముగల లాంతరు మొదట లాంతర్లు చేయువాడి యేర్పాటువలెనే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య,

శూద్రులను వారివారి పూర్వజన్మ గుణకర్మలనుబట్టి ఈశ్వరునిచే సృష్టించబడెను. ఆయాకారంగులుగల లాంతరులలోని దీపములు ఆయారంగులవలె ప్రకాశించును. అట్లే హృదయాకాశములోని ఆత్మజ్యోతిరంగులున్నూ నాలుగు విధములుగా ప్రకాశించును. వాటిని లోపలను, వెలుపలను, పొగ, దుమ్ము, మసి, కాకుండ పరిశుద్ధము చేసిననే ప్రకాశము స్వచ్ఛముగా నుండునట్లే బ్రాహ్మణాది శరీరముల కున్నూ లోపలను వెలుపలను దుష్ట స్పర్శాదులు లేకుండ చేసిననే మనోజ్యోతి ప్రకాశము స్వచ్ఛముగనుండును. మరియు ఆయాలాంతరు లలో పోయు పెట్రోలు, కిరసనాయిలు, యెర్రకిరసనాయిలు మొదలయినవాటివలన దీపం రంగులు మారునటుల సాత్విక, రాజస, తామస పదార్థానుభవమువలన మనోజ్యోతిరంగులు మారుచుండును. ఆయా లాంతరులను సీమసున్నము మొదలైనవాటిచే యెంత పరిశుభ్రము చేసినను ఆయారంగులలో అనగా తెల్పు, యెరుపు, పచ్చ, నల్పురంగులలో మిక్కిలి అధికప్రకాశముగలవియగును. అట్లే బ్రాహ్మణాది శరీరములను పవిత్రములుగ జేసిన యెడల ఆయాజాతులలోని వారలకంటె శ్రేష్ఠులుగా నెన్నబడుదురు. యెరుపు, పచ్చ, నలుపు రంగుల అద్దములను యెంత పరిశుద్ధము చేసినను తెలుపురంగుగా మార్పలేరో అట్లే క్షత్రియ వైశ్య శూద్రాదులు ఈ జన్మముందే సాత్వికతేజో శక్తిగలవారలు. అనగా బ్రాహ్మణులుగా గాజాలరు. కల్లు, సారాయి, నూనె మొదలైన పోసిన మట్టికుండను యెంత పరిశుద్ధము చేసినను పూర్వపువాసనలు వదలనికీతిని ప్రస్తుతము చండాలాదులను స్నానాదులచే పైకి యెంత పరిశుద్ధము చేసినను వంశపారంపర్యము బీజరూపముగ వచ్చు దుష్ట తేజస్సు ఈ జన్మముందే వదలను. బ్రాహ్మణాది చాతుర్వర్ణములను గురించి యాజ్ఞవల్క్యమహర్షి శ్లో॥ బ్రాహ్మణా క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చద్విజ సత్తమ । యేచాన్యేభూత సంఘానాం వర్ణాస్తాం చాపినిర్మమే॥ బ్రాహ్మణానాం సితోవర్ణ క్షత్రియాణాం చలోహితః ।

వైశ్యానాం పీతకోవర్ణః శూద్రాణా మసిత స్తథా॥ మనుష్యులలోనేగాక సమస్తమయిన పంచభూత సృష్టిలోనున్న యావత్తు వస్తు జాలములో నున్నా నాలుగు వర్ణములు అనగా రంగులు గలవనియు వాటిలో ధవళ లేక తెలుపు రంగుగలవి బ్రాహ్మణములనియు మెరుపువర్ణము గలవి క్షత్రియములనియు పీత లేక పచ్చరంగుగలవి వైశ్యములనియు నలుపు లేక అసితవర్ణము లేక మూడురంగులు కలసిన మిశ్రమము అనగా నలుపువర్ణముగలవి శూద్రములనియు చెప్పెను. అందువల్ల ఈ సృష్టికి ప్రధానములగు సూర్యాది గ్రహములలోను, నవరత్నముల లోను, రుద్రాక్షలు స్ఫటికములలోను, వృక్షజంతు మనుష్యాదులలోను నాలుగు వర్ణములు లేక నాలుగు రంగుల తేజస్సుగల జాతులు కలవు అని తెలుచున్నది.

తైత్తిరీయము శృతి॥ అజామే కాంలోహితశ్శుక్ల కృష్ణాంబహీస్ప్రజాంజనయంతీగుమ్‌సరూపాం॥ అనుప్రకారముసహజార్థమయున మెరుపు, తెలుపు, నలుపు రంగులుగా పోల్చదగిన రజ, స్సత్వ, తామస గుణాత్మకమగు మాయ తన స్వరూపసమానమయిన మెరుపు, తెలుపు, నలుపు ఆత్మజ్యోతి తేజోరూపములు గలఅనేకమంది ప్రజలను పుట్టించు చున్నది. అనగా మెఱుపు తెలుపు నలుపు, మిశ్రమము అనుమనో జ్యోతిప్రకాశముగల క్షత్రియ బ్రాహ్మణ శూద్ర వైశ్యులనుపుట్టించు చున్నదని తెలుచున్నది.

భ. గీ. 4 అ 13 శ్లో॥ చాతుర్ వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః॥ అనుప్రకారం పూర్వజన్మసంబంధమయున సాత్వికగుణకర్మలు, రాజస, గుణకర్మలు తామస గుణకర్మలు, మిశ్రమ గుణకర్మలు వీటి భాగములనుబట్టి నాలుగు రంగుల తేజస్సు గలవారలను అనగా బ్రాహ్మణాది నాలుగు జాతులను సృష్టించినానని చెప్పిన దానిని బట్టియు తెలుపు, మెరుపు నలుపు మిశ్రమములను నాలుగు రంగులు అని తెలుచున్నది.

ఒకవేళ పైసంగతులనుబట్టి బాహ్యమునకు కనిపించే రంగులను బట్టి వస్తుజాలములో తెల్లనివి బ్రాహ్మణములనియు యెర్రనివి క్షత్రియములనియు, పచ్చనివి వైశ్యములనియు, నల్లనివి శూద్రములనియు చెప్పదలచిన యెడల హాస్యాస్పదమగును. యికనేమనగాసదరు రంగులు హృదయాంతర్గతుడుగనున్న మనోజ్యోతియొక్క రంగులనియు, బాహ్యామునకు కనుపించని యితర వస్తుజాలములో వాటివాటి అంతర్గత తేజస్సు యొక్క రంగులనుబట్టియు బ్రాహ్మణాది నాలుగుజాతులలో జన్మలు కలుగుచున్నవనిన శ్రుతియుక్తి అనుభవయుక్తముగ నుండును. వస్తుజాలములో అంతర్గత తేజస్సు వాటివాటి గుణములనుబట్టియు మనుష్యులలో అంతర్గత తేజస్సుయొక్క రంగులు వారుజేయు సాత్వికాది కర్మలనుబట్టియు పొగయున్నచోట అగ్నియున్నదని గ్రహించునట్లు తెలుసుకొనదగియుండును. సర్వజ్ఞుడయిన ఈశ్వరుడు ఆయా ఆత్మజ్యోతిరంగులకుఅనుగుణ్యమైన బ్రాహ్మణాది జాతులయందు జన్మలు కలుగజేయుచున్నాడు. శ్రుతి. ధ్యానబిందూపనిషత్తు "అధ్యాత్మ నిర్ణయంవ్యాఖ్యాస్యేహృత్స్థానే అష్టదళపద్మం వర్తతే తన్మధ్యే రేఖావలయం కృత్వాజీవాత్మరూపం" జ్యోతి రూప మణుమాత్రం వర్తతే ...... ...పూర్వదళే విశ్రమతే పూర్వదళం శ్వేతవర్ణం తదాభక్తి పురస్సరం ధర్మమతిర్భవతి, తదాగ్నేయ దళేవిశ్రమతే త దా గ్నే య ద ళం ర క్త వర్ణం తదా నిద్రాలస్యమతిర్భవతి, యధా దక్షిణదళే విశ్రమతే తద్దక్షిణ దళం కృష్ణ వర్ణంతదాద్వేష కోపమతిర్భవతి, యదానైఋతి దళే విశ్రమతే నైఋతిదళం నీలవర్ణం తదాపాపకర్మ హింసామతిర్భవతి, యదోత్తర దళే విశ్రమతే తదుత్తరదళం పీతవర్ణం తదాసుఖ శృంగార మతిర్భవతి ...... యదాసంధి సంధిషుమధ్యే మతిర్భవతి" అను ప్రకారము ఆత్మజ్యోతిఆయాదిక్కులదళములయందు సంచరించునప్పుడు తెలుపు,యెరుపు,పచ్చన,నలుపు నీలిమొదలగురంగులుగా మారుచుండు ననియు దానినిబట్టియే వారివారి బుద్ధులుకూడ వివిధములుగా

నుండుననియు తేలుచున్నది. గనుక జీవితకాలములో సహజముగా శ్వేతవర్ణముగల హృదయకమలము యొక్క తూర్పు దళమందు ఆత్మజ్యోతి సంచారముగలవారలు సాత్వికగుణ ప్రధానులగు బ్రాహ్మణులుగను శ్వేతవర్ణముగల తూర్పుదళము రక్తవర్ణముగల ఆగ్నేయ దళముయొక్క మధ్యను ఆత్మజ్యోతి సంచారముగలవారలు రెండింటి మిశ్రమగుణములగు సత్వగుణముతో గూడిన రజోగుణ ప్రధానులైన రాజులుగను కృష్ణవర్ణముగల దక్షిణ దళమునందు సకృత్తుగను పీతవర్ణముగల ఉత్తరదళమందు ప్రధానముగను ఆత్మజ్యోతిసంచారము గల వారలు తమస్సుతో కూడిన రజోగుణప్రధానులైన వైశ్యులుగను, పీతవర్ణముగల ఉత్తరదళమందు సకృత్తుగను కృష్ణవర్ణముగల దక్షిణదళమందు ప్రధానముగను ఆత్మజ్యోతి సంచారముగలవారలు రజోగుణముతో గూడిన తమోగుణ ప్రధానులైన శూద్రులుగను కృష్ణవర్ణముగల దక్షిణ దళమందు సకృత్తుగను నీలవర్ణముగల నైఋతిదళమందు ప్రధానముగను ఆత్మజ్యోతి సంచారము గలవారలు చండాలాదులుగను జన్మించుచున్న వారని తెలియుచున్నది. యిదివరలో భుజించు సాత్వికాది పదార్థములచే మనస్సున్నూ అదేవిధముగా పరిణమించునని వ్రాసియుంటిమి. అందువల్ల అధిక ప్రకాశముగల తేజస్సుగలవారలు తమకంటె తక్కువ ప్రకాశముగల తేజస్సుగలవారలను స్పర్శాదులవలన నష్టతేజోవంతులై చెడుదురు. గనుక చండాలాదుల స్పర్శచాతుర్ వర్ణ్యులకునిషేధము భగవద్గీతలలో నాలుగు వర్ణములే చెప్పబడియున్నవనియు అస్పృశ్యతనుగురించి చెప్పబడనే లేదనియు తలచుట భావ్యము కాదు- ఏమనగా నాలుగువర్ణములున్నవని వప్పుకున్నవారలు, వారలఅన్యోన్య సాంకర్యముచే అనేక వర్ణములు కలుగుననియు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య శూద్రజాతులకంటె భిన్నములైన గీతలలో వాడబడిన శ్వపాక, పాపయోనయః, అను శబ్ద వాచ్యులైన హీనజన్మలు కలవారు కలరనియు గ్రహించవలెను. ప్రధానజాతులు నాలుగనియేగాని సంకర

జాతులు లేవని అభిప్రాయము కాదు. వేదములలో కూడ నాలుగు వర్ణములేగాక యితర వర్ణములగు కులాల, చండాల, అంత్యజ వైఖానస, పారద్విజాదులు కలవని యున్నది. సర్వోపనిషత్సారమగు భగవద్గీతలలో శౌచము అని వాడబడిన శబ్దమునకు శుచివల్లనయినది శౌచము. అట్టి శుచిత్వము అపవిత్రముగా నుండు పదార్థ జంతు మనుష్యాదులను స్పృశించకుండిననే కలుగును. అది అస్పృశ్యతగాక మరే మగును? శౌచం అనగా సంకర వర్జనం నిందిత సంసర్గ అభక్ష్యాది పరిహార పూర్వకం స్వధర్మ వ్యవస్థా స్థాపనం శౌచం ఇతిస్మృతిః॥ శాండిల్యోపనిషత్ శృతి॥ శౌచం నామద్వివిధం । బాహ్యమాభ్యంతరం చేతి . తత్రమృజ్జలాభ్యాం బాహ్యం । మనశ్శుద్ధిరాం తరంతదధ్యాత్మ విద్యయాలభ్యతే॥అను ప్రకారంమృత్తుచేతను,జలముచేతను,బాహ్యశౌచం అనుటచే అస్పృస్యత పూర్వకమయిన పరిశుద్ధిగానుండుటయే యగును. భ. గీ. 1 అ 13 శ్లో॥ అచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః॥ అని జ్ఞాన సంపాదన సంగతులలోనున్నూ 16 అ 3 శ్లో॥ తేజఃక్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతి మానితా॥ అను దైవీగుణములలో నున్నూ అదే అధ్యాయం 7 శ్లో॥ నశౌచం నాపిచాచారో న సత్యం తేషు విద్యతే॥ అను ప్రకారము రాక్షసాంశగలవారలకు బాహ్యాభ్యంతర శుద్ధియు ఆచారము, నిజము పలుకుటయు వుండరని చెప్పబడి యున్నది. గనుక ఆయాశ్లోకములయందు వాడబడిన శౌచశబ్దమును బట్టి అస్పృశ్యతను గ్రహించవలెను. మరియు దైవాంశము గలవారలు పవిత్రులుగను, రాక్షసాంశగలవారలు అపవిత్రులుగ నుందురనియు తెలియుచున్నది. గ్రంథబాహుళ్యమగు సర్వోపనిషత్తులను క్లుప్తపరచి వాటి వాటి సారమును సూక్ష్మార్థముచే బోధించబడినవి భగవద్గీతలుగానున్నవి. పైన శృతిలోనున్న ప్రకారంతత్రమృజ్జలాభ్యాంబాహ్యం అను ప్రకారము మృత్తుచేతనున్ను జలముచేతనున్ను బాహ్యశుద్ధి చేసుకొనవలెనని చెప్పబడియున్నది. శ్లో॥ శుద్ధదేశే మృదాసీయ

కుర్యాద్గాత్రానులేపనం, మూత్రపార్థివ సంయుక్తం భౌమస్నానం విదుర్బుధాః॥ అను ప్రకారం ప్రత్యక్షస్నానాసక్తఅసంభవములలో పవిత్రస్థలముల యందుండు మన్నును తీసికొనివచ్చి పార్థివమూత్ర సంయుక్తముగావంటికి పూసుకొనుట భౌమస్నానమని చెప్పబడియున్నది. ...............

పవిత్రస్థలములు అనగా శ్లో॥ పర్వతాగ్రే నదీతీరే ధర్మక్షేత్రే విశేషతః॥ సింధుతీరేచ వల్మీకే తులసీ మూల మృత్తికా, మృద ఏతాస్తు సంగ్రాహ్యావర్జయే త్త్వన్యమృత్తికాః॥ పర్వతాగ్రములయందలిదిన్ని, మహా నదీతీరములయందలిదిన్ని, పుణ్యక్షేత్రముల యందలిదిన్ని, సముద్ర తీరములయందలిదిన్ని, తులసి, బిల్వము మొదలైన పవిత్రవృక్ష మూలముల యందలిదిన్ని, మృత్తికనుగ్రహించవలెను. గాని యితర మృత్తికలుపనికిరావు. జలముచేతను, పవిత్రతకుతగిన శ్రీగంగాదిమహా నదులలోనిఉదకమే శ్రేష్ఠము. గనుక జననాది సర్వకాల సర్వావస్థల యందును ఆమరణాంతమువరకున్నూ తుదకు మృతదేహదహనాదికము వరకున్నూ యిదివరలో వివరించిన ప్రకారము అస్పృశ్యతపాటించుటయే సనాతనధర్మశాస్త్ర నిర్ణయములో ప్రధానముగా నున్నది. అస్పృశ్యత నివారణవలని చెరుపులను గురించిప్రత్యక్షముగాకొన్ని గ్రహించగల్గినను పూర్తిగా గ్రహించుటకు అతీంద్రియ ద్రష్టులైన సనాతనధర్మ ప్రచారకులయిన మహాఋష్యాదులు కనిపెట్టి వ్రాసిన సూక్ష్మాతి సూక్ష్మములన ధర్మశాస్త్రాధారముననె నిర్ణయించుకొనవలసి యున్నది. వాటి వాటి అర్థమును గ్రహించుటకుకూడ సూక్ష్మబుద్ధియే కావలెను. సూర్య కాంతి గ్రహించలేనిదివాంధముగు ఘూకమువలె స్థూలబుద్ధిగలవారలకు బోధపడుటయే దుర్లభముగానుండును. యేమతవిషయములలో చర్చించి విమర్శించునప్పుడు ఆయామత విషయమైన నిర్ణయ గ్రంథములను లేక శాస్త్రములను బట్టియే విమర్శించి నిర్ణయించు కొనవలసినదే గాని యితర మతగ్రంథములలోని ధర్మములను ఆచారములను పురస్కరించుకొని సనాతనధర్మ నిర్ణయమునుగాని ఆక్షేపణలుగాని చెయ్యకూడదు. ఒక

వేళ చెయ్యవచ్చును అనువారలు ద్విజాతులకు సగా జందెములు అక్కఱలేదు. జాతిమతాచారములతో ప్రసక్తి లేకుండా బ్రహ్మ విచారము చెయ్యవచ్చును. బ్రహ్మసమాజము వారినిర్ణయప్రకారమున్నూ చండాలులను సగా జందెములు వేసి పవిత్రులను జేయవచ్చునను ఆర్యసమాజమువారినిర్ణయ ప్రకారమున్నుమధు మాంసాది నిషిద్ధాహార విహారములయందుండు సమస్తజాతులవారును తత్వజ్ఞానము సులభుగా లభింప జేసుకొనవచ్చునను. తత్వజ్ఞాన సమాజమువారి నిర్ణయముల ప్రకారమున్ను యింకను అనేక తండోప తండములుగా బయలు దేరుచున్న ఆయా సమాజధర్మములప్రకారమున్నూ అన్యోన్యవిరుద్ధములు గానున్న వేటినిబట్టి నిర్ణయించెదరో లేక సంస్కరించెదరో నిర్ణయించసాధ్యముగాదు. అయినను పై సమాజములలో దేనిలోనో నొకదానిలో చేరియుండి గోముఖవ్యాఘ్రమువలె గూఢముగా వాదించు వారిని తెలుసుకొనిన వెంటనేతానును సనాతన ధర్మీయుడననియే చెప్పుటకు సిద్ధపడును. గాని యేరామమోహన రాయిగారో, యే దయానందస్వామిగారో, యే ఆనిబిసెంటు దొరసానిగారో యెవరో యొకరు కొంతకాల నిర్ణయము క్రింద టను స్థాపించబడిన సమాజములును సనాతనములని చెప్పుటకు వీలులేదని మాత్రము గ్రహించుడు. సనాతనధర్మము సృష్టిప్రారంభము నుంచి యేర్పడియున్నది. సంఘ సంస్కర్తలమనువారు యేమతసంఘముకు చేరినవారలు యేమతసంఘమును సంస్కరించెదరు. అట్లు సంస్కరించుటకు యేమతసంఘమువారు యెప్పుడు కోరుకొనియుండిరి. అట్లు కోరుకొనినవారుండిన యెడల వారి మతములనే సంస్కరించవలెనెగాని అన్యమతములను సంస్కరించు నధికారమెక్కడిది? ఒకవేళ యెవరు కోరుకొనకపోయినను తామే లేని అధికారమువహించి సంస్కరించెదమను సంఘ సంస్కారులందరి అభిప్రాయము సయితం ఏకీభవించియుండునా? అట్లు ఏకీభవించక భిన్నాభిప్రాయములతో నుండిన

యేసంఘ సంస్కర్తలమాటలను వినవలసియుండును. ఒకవేళ సంఘ సంస్కర్తలు అందరు ఏకీభవించి నిర్ణయించినప్రకారము వకనిర్ణయము లేక శాస్త్రమును రచించియుండిరా? అట్లు లేనియెడల వూసరవెల్లి రంగులవలె యెప్పటికప్పుడు మార్చుచుండెదరా. యీహాంశముల కన్నిటికి సరియైన జవాబులు విచారించుకొనినయెడల నేను చక్రవర్తి నైతినని చెప్పుకొనిన యెంతటి ప్రయోజనమో సంఘ సంస్కర్తలమని చెప్పుకొనినను అంతటి ప్రయోజనముగానే యుండును. యేది యెట్లున్నను బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర చండాలాదుల సనాతనధర్మములను సంస్కరించి తీరవలయునను వారలు యిదివరకే సనాతనాచార ధర్మ శాస్త్రములును నిర్ణయించిన మహాఋష్యాదులకంటె యేయే విషయములలో తాముగాని ఆయామతకర్తలుగాని అధికులో చరిత్రాంశముల వలనగాని ప్రత్యక్షముగాగాని ఋజువుచెయ్యవలసియుండును. అట్లు ఋజువుచెయ్యలేకపోయిన యెడల వారి మాటలప్రకారము వర్తించువారలు "మసగొని రేగుబండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు"గ నుండును. యెట్టి యోగ్యతలేని సామాన్యుల దను సనాతన ధర్మ సంస్కరణకుబూనుట అవివేకము. గనుక త్రికాలవేదులు అతీంద్రియద్రష్టలు, నిగ్రహానుగ్రహసమర్థులు, మానవాతీత మహిమాన్వితులు కందమూల ఫలాహారులైయుండి ఖ్యాతిలాభ పూజల నపేక్షింపక కేవల లోకోపకారము కొరకు మాత్రమే వ్యాపింపజేసిన సనాతనధర్మ ప్రచారకులైన మహాఋష్యాదుల నిర్ణయములను నమ్మి వర్తించినయెడల ఇహ పరసౌఖ్యము లభించును. ఒకవేళ మహాఋష్యాదులు అట్టిశక్తి గలవారలని మేము నమ్మనువారలు. వారలుచెప్పెడు మతకర్తల చరిత్రాంశములనుగాని వారిమాటలనుగాని నమ్మవలసిన విధాయకమెట్లుండును. భ॥ గీ॥ 4 అ 40 శ్లో॥ అజ్ఞశ్చాఽశ్రద్ధధానశ్చ సంశయాత్మావినశ్యతి । నాయంలోకోస్తి నపరోనసుఖం సంశయాత్మనః॥ గ్రహించలేనివాడును, అశ్రద్ధప్రవర్తనుడున్నూ, ప్రతి విషయములోను

సందేహ మనస్కుడును చెడిపోవుదురు. అట్టి సంశయ మనస్సు గలవార లకు ఈప్రపంచము విషయమున్నూ లేదు - పరలోకమున్నూ లేదు, సుఖ మున్నూ లేదు. భ.గీ 16.అ24 శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యా కార్య వ్యవస్థితౌ। జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥ కావున శాస్త్రములను ప్రమాణములను నమ్మి శాస్త్రసమ్మతములైన కర్మలను శాస్త్రబాహ్యములైన కర్మలను తెలుసుకొని శాస్త్రోక్తము లైన కర్మలనే చెయ్యదగియుండును. గనుక శ్రుతిస్మృతి ఇతిహాసము లనుబట్టియు లోకానుభవమునుబట్టియు యుక్తిననుసరించియు వస్తు గుణమునుబట్టియు యిదివరలో వ్రాయబడిన హంశములను విమర్శిం చగా వాచ్యా, అవాచ్యములు, అనగా నోట వచింపవలసినవి వచించ గూడనివి. శ్రావ్యాశ్రావ్యములు అనగా వినతగినవి వినతగనివి స్పృశ్యా స్పృశ్యములు అనగా తాకవలసినవియు తాకగూడనివియు వీక్ష్యావీక్ష్య ములు అనగా చూడవలసినవి చూడగూడనివి భక్ష్యాభక్ష్యములు అనగా తినవలసినవి తినగూడనివి ఆఘ్రాణములు, అనాఘ్రాణములు అనగా వాసనచూడవలసినవి వాసనచూడగూడనివి, ఈప్రపంచములోనుండు వస్తుసముదాయములోగలవని నిరూపించబడెను. వాటినిబట్టి ఆసేతు హిమాచలపర్యంతము జరుగుచున్న అస్పృశ్యతానివారణ లేక అంట రానితనమును నిర్మూలించుటకు యెంతమాత్రము అవకాశము లేదని సూక్ష్మబుద్ధిగలవారలు గ్రహించగలరు. ఒకవేళ బుద్ధిమాంద్యజనితో న్మాదులైన స్థూలబుద్ధి గలవారలుకొందరు అస్పృశ్యతానివారణ చెయ్యవలసినదేనని చెప్పేయెడల దానితోపాటు అవాచ్యతా నిర్మూల నము అనగా నోటికివచ్చినవెల్ల వచించవచ్చుననియు అస్పృశ్యతా నిర్మూలనము అనగా ఈ ప్రపంచములోనుండు అన్నివస్తువులను మను ష్యాదులను అందరిని తాకవలసినదేననియును, అవీక్ష్యతా నిర్మూలనము అనగా అన్నివస్తువులు చూడతగినవేయనియు అభక్ష్యతా నిర్మూల నము అనగా అన్నిపదార్థములు తినవలసినవేననియు అనాఘ్రాణ

నిర్మూలనము అనగా అన్నివస్తువులు మూర్కొనవలసినవేననియు చెప్పి నట్లేయగును. అందుచేత పవిత్రతకోరునట్టి దేహధారియైన ప్రతివాడును పైవాటియొక్క అన్నిటి పవిత్రవస్తు స్పర్శలవలననె నిత్యము జీవించ వలసియుండును. గనుక అందుకు వ్యతిరేకముగా అపవిత్ర వస్తు స్పర్శాదులు ఆచరించుటకు సిద్ధపడినయెడల అపవిత్రుడగుటే గాక ఒకప్పుడు ప్రాణాపాయముకూడా సంభవించును. సనాతనులు అట్టి శాస్త్రయుక్తి అనుభవములకు విరుద్ధముగానున్న అస్పృశ్యతానివారణ ఎంతమాత్రము అంగీకరించకూడదు.

జ్ఞానవాసిష్ఠము క॥ హరిణ, కరి, ఝష,శలభ, మధుకరములు నొక్కొకటగ్రాగి గడు నింద్రియముల్ బరువడినన్నియు నిన్నున్ బొరినడపగనెట్లు సుఖము బొందెదు మనసా॥ అనునట్లుగా వేటకాని ఘంటానాదము వినునట్టి శబ్దానందముచే జింక వేటకానికిజిక్కిచచ్చు నట్లును ఏనుగు మైధునాపేక్షియై స్త్రీ యేనుగువెంటజని స్పర్శ సుఖ ముకొరకు వేటకాని గోతిలోబడునట్లును, నేత్రదృష్టికి ప్రకాశమాన ముగానుండు మంటయొక్క రూపానందమునకు సంతసించుచు తుదకు మంటలోబడి చచ్చునట్టి మిడుతవలెను, రసగ్రాహణమగు జిహ్వేంద్రియ చాపల్యముచే తేనెనుగూడబెట్టి తుదకువేటకాని మంటలోబడి చచ్చు నట్టి తేనెటీగవలెను, గాలముయొక్క మొంటెకొన యందుండెడు యెఱ్ఱ యొక్కమాంసవాసనను ఘ్రాణేంద్రియముచే గ్రహించి గాలముమ్రింగి చచ్చునట్టి చేపవలెను, ఒక్కొక్క ఇంద్రియముచేతనేనాశనమగుచుండగా అన్ని ఇంద్రియములను స్వేచ్ఛ స్పర్శగా నడపిన యెడల నాశనమగు టకు సందియముండునా?

యాజ్ఞవల్క్యఋషి శ్లో॥ విహితస్యాన్న నుష్ఠానాన్ని షిద్ధస్యచసే వనాత్ । అనిగ్రహాశ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥ అనగాశాస్త్ర విహితములైనవి చెయ్యకపోవుటయును శాస్త్రనిషిద్ధములను చేయుట యును ఇంద్రియములను నిగ్రహించలేనట్టిన్ని మనుష్యుడు నరక ములో పడును.

స్పర్శసుఖాస్పదమైన పాణిగ్రహణమును గురించి.

స్త్రీపురుషులు అన్యోన్యస్పర్శ సుఖానుభవజన్యమైన సత్సంతానము బడయుటకుగాను ఉపస్థేంద్రియ నియమనిగ్రహసాధనమగు సనాతన ధర్మశాస్త్రీయ నిబంధనయేది కలదో దానిని పాణిగ్రహణము అనిన్ని వివాహము, ఉద్వాహము అను మొదలగు పర్యాయపదములచే వాడబడుచున్నది. అట్టి పాణిగ్రహణము ధర్మప్రజావృద్ధికొఱకుగాని కేవల రత్యర్థముగాదు గనుక స్వకులాచార ధర్మయుక్త యోగ్యసంతానము బడయగోరువారందరు నారదపరివ్రాజకోపనిషత్తు శ్రుతి "స్వకులానురూపాభిమత కాన్యావివాహ్యా-అను ప్రకారంసమాన జాతీయరూపు రేఖావిలాసినియగు కన్యనే వివాహ మాడవలయునని యున్నది. శ్లో॥ అష్టవర్షాద్భవేద్గౌరి నవవర్షాతురోహిణీ, దశవర్షాద్భవే త్కన్యాఅత ఊర్ధ్వం రజస్వలా, అను పారాశర్యవచనాను సారము కన్య అనగా రజస్వలకానిది అనియే తేలుచున్నది. సనాతన ధర్మప్రకారం రజస్వలకాని కన్యనే వివాహ మాడవలశిన దని విధియున్నది. క్రీస్తు మత గ్రంథమగు బైబిలులో లేవియూకాండము 13 కీర్తన ఆమొక న్యాత్వమందాతడు భార్యగా స్వీకరించ వలయును. భర్తచనిపోయిన స్త్రీనిగాని భర్తతో పరిణయము సంబంధము గలిగి విడిచినస్త్రీనిగాని యపవిత్రమైన దానినిగాని లంజెనుగాని యాతను స్వీకరించగూడదు. ముందుగానాతడు స్వప్రజలలోని యొక కన్యను భార్యగా స్వీకరించ వలయును. Livictus 21,23,14,13, అనియున్నది. మహమ్మదీయ మతములోకూడ రజస్వలగాని కన్యనే వివాహమాడుట ముఖ్యధర్మముగా నుండుటచేతనే మహమ్మదు, బాలికనువివాహమాడెను. యిట్లు సనాతన మతవిరుద్ధమును యితరమత విరుద్ధమును అగునట్టిన్ని స్త్రీలు ప్రథమ యవ్వనమందు భ్రష్టస్వేచ్ఛా ప్రవర్తకులగు నట్టిన్ని రజస్వలానంతర వివాహము అనదగినట్టిన్ని 14 సం॥ ములకు లోపున స్త్రీలకు వివాహము చెయ్యగూడదని శారదా శాసనము ప్యాసుచేయించి

యుండుట అనాలోచన ప్రజాభిప్రాయ మూలకమైన అన్యాయము- ప్రాణిగ్రహణము అనగా చేతినిగ్రహించుట, లేక చెయ్యిపట్టుకొనుట. అను సామాన్యార్థమును తీసుకొని విపరీతవాదులు కొందరు యితర మంత్రితంత్రములతో ప్రయోజనమేమనిన్ని చేతిని పట్టుకొనిన చాలును అనిన్ని చెప్పుటసరికాదు- అదే అర్థముచేసే యడల యేస్త్రీ చెయ్యి అయినను లేక పురుషుని చెయ్యి యైనను పట్టుకొనిన వివాహమగు ననిన యడల హాస్యాస్పదమగును. ఏమనగా దానము చేయువాటిని బట్టి శ్లో॥ అశ్వే కర్ణే గజేదంతే దాసీకేశే అజాగళే, గృహా, స్తంభె గాంపుచ్ఛె కన్యాకాకరెపత్యాన్యష్టానిదానానితిష్ఠన్నేవనసంశయః॥అను ప్రకారంకన్యా దాతలైన తల్లిదండ్రులు తగినవరునకు కన్యాదానము చేయునప్పుడు "కన్యకాకరె" అను ప్రకారం కన్యయొక్క చేతినిపట్టుకొని వరుని చేతి యందుంచుటచే అట్టి దానపూర్వకముగా లభించిన కన్యయొక్క హస్తమును గ్రహించునది గనుక పాణిగ్రహణము అని వాడబడు చుండెను. యిట్లే యితర వివాహాది శబ్దములకున్నూ, విశేషార్థము లుండును "సోమః ప్రథమో వివిదెగంధర్వో వివిద ఉత్తరః తృతీయో అగ్నిష్టేపతిస్తురీయస్తే మనుష్యజాః" అను మంత్రమునుబట్టి స్త్రీకి ముగ్గురు భర్తలైరి. మనుష్యుడు నాలవవాడనియు చెప్పుచు కొన్నిమంత్రము లకు విపరీతార్థప్రసంగముతో స్త్రీ పునర్వివాహము చేసికొన వచ్చునని చెప్పసాహసించు చున్నారు- అదిసరికాదు- శ్లో॥ కామకాలేతు సంప్రాప్తే సోమోభుంక్తేతు కన్యకాం। రజఃకాలే తుగంధర్వో వహ్నిస్తుకు చదర్శనే। తస్మాదుద్వాహ యేత్కన్యాం యావన్నఋతుమతీ భవేత్॥ అనిసంవర్తుని వచనానుసారము కామకాలము అయిన యెనిమిదవ సంవ త్సరము సుమారున మనోకారకుడగు చంద్రుడు అనుభవించు చున్నా డనగా భర్త్రాభిలాష కామసంకల్పము మనస్సులో కలుగుననియు, రజః కాల సామీప్యమగు తొమ్మిదవ సంవత్సరము సుమారున గంధర్వాను భవ వివాహమువలె పురుషాలింగనాది అభిలాషిణియగుననియు అగ్నిచే

ననుభవములనగా కుచ దర్శనారంభమగు పదియవ సం॥రం సుమా
రున కామేచ్ఛచే మన్మథాగ్ని కలుగుననియు పది సం॥రములు దాటిన
రజస్వలగా నెంచ బడుటయు కొందరు రజస్వల లగుటయు జరుగును
అట్లుగాక సోముడు, గంధర్వుడు, అగ్నియు, స్త్రీని భర్తవలె అనుభవించు
చున్నారనుట భావ్యముగాదు- మనోసంకల్పము కలుగును. శ్లో॥ గౌరీం
దదన్ నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదన్ కన్యాందదన్ బ్రహ్మ
లోకం రౌరవంతు రజస్వలాం, అనుబృహస్పతి వచనానుసారము, గౌరీ
దానమువలన నాకపృష్ఠము, రోహిణీ దానము వలన వైకుంఠమును,
కన్యా దానము వలన బ్రహ్మలోకమున్ను రజస్వలా దానముచే
రౌరవాదినరకానుభవమున్ను కలుగును గనుక స్త్రీలకు తుదకు
రజశ్వల కాకపూర్వమైనను వివాహము చేసితీరవలెను అట్లుచెయ్యని
యెడల శ్లో॥ మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తధైవ చత్రయస్తే
నరకంయాంతిదృష్ట్వాకన్యాం రజస్వలాం॥ అనిపారాశర్య వచనప్రకారం
తల్లియు, తండ్రియు, జేష్ఠసోదరుడు యీముగ్గురు నరకమునుఅనుభవించ
వలసియుండును- రజస్వలయైన స్త్రీ యాజుషీయ కఠోపనిషత్ శృతి॥
దర్శనం స్పర్శనం కేళిః కీర్తనం గుహ్యభాషణం సంకల్పోధ్యవసాయశ్చక్రి
యానిర్ వృత్తి రేవచ, ఏతన్మైధు నమష్టాంగం ప్రవదంతి మనీషిణః
విపరీతంబ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః అనుప్రకారంబ్రహ్మచర్య
లోపమగు కామమోహితురాలై అన్యపురుషుని చూచుటయైనను సంభ
వించునట్టి దుష్టసంకల్పము మనస్సులో కలుగకపూర్వమే వరనిర్ణ
యము చేశియుండిన ఆభర్తయందే అనురాగము గలదై యుండునని
యెంచి రజస్వలాత్పూర్వమె వివాహము నిర్ణయించి యుండిరి. ఆకార
ణము చేతనేఅదివరకు మనస్సులో వరించిన సత్యవంతుని అల్పాయువు
గలవాడని తెలిసియుండియు సావిత్రి పెండ్లిచేసుకొనియెను. స్వయం
వరములో జయించి తెచ్చిన అంబయను కన్యను అదివరకే యితరుని
మోహించి మనోదుష్టయగుటను గ్రహించి భీష్ములవారు వదలివేసిరి.

రజస్వలమైన స్త్రీ శ్లో॥ పూర్వం పశ్యే దృతుస్నాతాయాదృశే నరముంగనా, తాదృశం జనయేత్ పుత్రం భర్తారందర్శ యేదతః॥ స్నాతా నా ర్యాదన్యపురుషం యదిపశ్యే ద్రజస్వలా తతః । పతిరూపం నివస్వంతం పశ్యే తద్దోషశాంతయే॥ అను ప్రకారం ఋతుస్నానానంతరము మొదటగా నెట్టిపురుషుని మోహదృష్టితో జూచునో అట్టి సంతానము కలుగు ననియు అందువల్ల భర్తనుగాక ప్రమాదముచే అన్యపురుషుని దర్శన దోష నివృత్తికై ప్రత్యక్ష పతి స్వరూపముగా భావించి సూర్యదర్శన ప్రార్థనాదులు యిప్పటికిన్ని సనాతన స్త్రీలు ఋతుస్నానానంతరము చేయుచుండుటకు కారణముగానున్నది. అందువల్ల రజస్వలాత్పూర్వమె భర్తను వరించి యుండినయెడల 'రజసా స్త్రీ మనోదుష్ట' అనుప్రకారం మనోదుష్ట కాకుండి భర్తనే కామించుటచే సంతాన సాంకర్యము కాకుండునని అట్లు నిర్ణయించబడెను.

ఇదివరలో బాలికలకు 14 సం॥రములకు లోపున వివాహము చెయ్యగూడదని శారదా శాసనమును ప్రభుత్వమువారిచే ప్యాసు చేయించి యున్నవారిలో ప్రధానుడగు శ్రీ శారదాగారే రజస్వలా నంతర వివాహము లనదగిన 14 సం॥రములు దాటి స్త్రీలకు వివాహము చేయుట శాస్త్రీయము గాదని నేటికి గ్రహించగలిగినందుకు దృష్టాంతముగా శారదా శాసనమును ఉల్లంఘించి తమ కుటుంబములోనే తమ సోదరుని కుమార్తెకు 12 సం॥రములకు లోపున వివాహము జరిగించి యుండిరి. యందువలన కూడ శారదా శాసనము దేశారిష్టదాయకమని దృఢముగా ఋజువగుచున్నది. శాస్త్ర సమ్మతముగా వివాహమయిన స్త్రీ యెవరియొక్క వంశవృద్ధికొరకు పూర్వజన్మ కర్మానుగుణ్యముగా బద్ధురాలై అనేకమంది యోగ్యులయిన పెద్దలచే విచారించి నిర్ణయించబడి ఆయా దేవతావాహన మంత్రపూర్వకముగా అగ్నిహోత్ర సన్నిధియందు ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి అను మొదలైన ఘోర ప్రమాణములు చేసికొనునట్లుగా బంధము యేర్పర్చుకొని

నదీవివాహబంధముగా నున్నది. అందుకు విఘ్నముగా తన పూర్వజన్మ దుష్కృతమువలన కం॥ సతిపతుల నెడలు బాపిన యతివలు కౌమారసమయములందున వినిర్గత భర్తృకలై యుండుదురు సతతము త్రిసప్తజన్మములందున్॥ అను ప్రకారం 'అవశ్యమనుభోక్తవ్యంకృతకర్మశుభాశుభమ్' అను ప్రకారం భార్యాభర్తలకు యెడబాపినదోషముచే వైధవ్యము సంభవించి యిరువదియొక్క జన్మల వరకుగాని కొన్నిజన్మలవరకుగానిఅనుభవించుదురని యున్నది. అట్టి దుష్కర్మ అనుభవించక తప్పునా? గనుక తిరిగి ముందు జన్మకు అట్టి ప్రమాదము రాకుండ ప్రాయశ్చిత్త పూర్వక సుకర్మలనే చేయుచు తనకున్నూ, భర్తకున్నూ సద్గతి కలుగునట్టి సత్కర్మలనే చేయుచుండవలెను. ఈ జన్మయందు భర్తమరణించినను నపుంసకుడైనను సన్యసించినను, దేశాంతరగతుడైనను మొదలయినవి వాగ్దత్తవిషయములోను అపద్ధర్మములనుబట్టిన్ని కలియుగ నిషేధము యునట్టిన్ని వాటిని పురస్కరించుకుని స్త్రీలు పునర్వివాహము చేసుకొనుటకు గాని వివాహ విచ్ఛేదము కొనుటకు గాని వీలు లేదు. యేమనగా శ్రుతి॥ 'అర్థోవా ఏష ఆత్మనో యత్పతి రితితస్య విప్రస్యస్త్రీపురుష ద్వయాత్మకం యచ్ఛరీరం తస్యశరీరస్యార్థం స్త్రీరూపం' అను ప్రకారం స్త్రీ పురుషుని యొక్క అర్థశరీర మనుటలో స్త్రీ పురుషులు యిద్దరున్నూ కలసిన యేక శరీరముతో సంతానము బడయవలసియుండుటచే యేకశరీరులనదగియున్నారు. అందువల్లనే భార్య గర్భిణితోనుండునప్పుడు శ్లో॥ క్షౌరం శవాను గమనం నఖకృంతనంచ యుద్ధాదివాస్తుకరణం త్వతిదూరయానం ముద్వాహ ముపనయనం జలధేశ్చగాహః మాయుః క్షయార్థమితిగర్భిణి కాపతీనాం॥ అనగా క్షౌరము చేయించుకొనకుండుట, శవానుగమనము చెయ్యకుండుట అను మొదలయిన నియమములు భర్తకున్నూ వుండుటకు కారణమైయున్నది. స్త్రీ పురుషులు దాంపత్య విచ్ఛేదము కొన్ని జన్మలవరకున్ను లేకుండి పుణ్యపాపములు వకరివి వకరికి సంక్రమింపజేసుకుని తుదకు మోక్షము

నందు వారుగా నున్నారు. యేప్రాణియైనను అన్యోన్య సహాయము లేకుండ జననాది మరణ పర్యంతమున్నూ మరణానంతరము ఉత్తర జన్మ ప్రాప్తి హేతువగు పిండోదకక్రియలు చేయుటలోనున్నూ అన్యోన్యసహాయముతోనే యుండవలసినవారై యున్నారు. బ్రహ్మోత్తర ఖండములో దాశరాజు తనభార్యయైన కుముద్వతికి చెప్పిన ప్రకారము వారు ఉభయులు యెనిమిది జన్మములవరకు పారంపర్యము దాంపత్యవిచ్ఛేదము నొందక భార్యాభర్తలుగా జన్మించుచుండి తుదకు మోక్షము నందినట్లున్నది. శ్రీ మహాభాగవతములో దేవకీ వసుదేవులు పూర్వజన్మవృత్తాంతము శ్రీకృష్ణుడు వారికి చెప్పుటలో బృశ్నియను మహాపతివ్రత దేవకియు, సుతపుడను ప్రజాపతి వసుదేవుండును అయియుండి సంతానార్థము తపస్సుచెయ్యగా వారి యందుండు అనుగ్రహార్థము బృశ్నిగర్భుడను పేరుతో జన్మించియుంటిననియు, ఆతను వాయి జన్మయగు రెండవసారి దేవకి వసుదేవులు అదితి కశ్యపులుగా జన్మించిన మీదట వామనావతారముగా తాను జన్మించితిననియు మూడవ జన్మయగు దేవకీ వసుదేవులుగా జన్మించిన మీయందునేను శ్రీకృష్ణుడనుగా జన్మించితి ననియు యికమీదట మీవుభయులకు జన్మలేదనియు వచించియుండెను. యిట్లు కొన్నిజన్మలవరకు వదలని దాంపత్యము యిప్పుడు కొందరు వ్రాసుకొను అగ్రిమెంటుకంటె అధిక గౌరవముగల పైన వివరించిన వివాహబంధమును ఈజన్మయందే దాంపత్య విచ్ఛేదము చేసుకొనుటకు స్త్రీ పురుషులలో యెవరికిన్నీ అధికారములేదు. శ్లో॥ పాణిగ్రహస్య సాధ్వీ స్త్రీ జీవతోవామృతస్య వాపతిలోకమభీప్సంతి నాచరేత్కించిద ప్రియం॥ అను మనువచనానుసారము పాతివ్రత్యస్త్రీ భర్త సజీవుడయి యుండినను మరణించినను భర్తతోపాటు పరలోకమందు వర్తించుటకు దగిన యోగ్య కర్మలనే చేయుచుండ వలెనేగాని కొంచమయినను అప్రియముగా నుండకూడదని యున్నది. పూర్వము అంధుడైన చ్యవనుడను మహాఋషికి సుకన్య

యమునది భార్యగా యియ్యబడియు మహాపతి వ్రతమైయుండెను. రాజ్య హీనుడై అనేకకష్టముల పాలుజేసి తుదకు మహారణ్యములలో వంటరిగా వదలివెళ్ళిన నలమహారాజును యెన్నికష్టముల కోర్చియైనను పాతివ్రత్య ప్రభావముగల దమయంతి భర్తను విడువకుండెను. భర్త మరణించుటయు నపుంసకుడగుటయు, కుష్ఠురోగి మొదలైన దుర్లక్షణములు గల వారలు సంభవించుట పూర్వజన్మ కృత పాపాధిక్యము చేత నేనని గ్రహించక పోవుట అవివేకము. నారదవశిష్ఠాది స్మృతులు కొన్ని వివాహవిచ్ఛేద, పునర్వివాహములకు, తావిచ్చుచున్న వనుటపొరపాటు. కన్యాదానము క్రియాదత్తకాక పూర్వము వాగ్దత్త విషయములో వర్తించదగిన "నష్టే, క్లీబే, ప్రవ్రజితే" అను మొదలైనవాటిని విపరీతార్థ కల్పనతో అందరి స్త్రీలకు వర్తించు ననుటకూడదు. లేక అట్లే కూడు ననే యడల పూర్వము పునర్వివాహముగాని వివాహవిచ్ఛేదముగాని జర్గియున్నట్లు గ్రంథ దృష్టాంతము లేకపోవుటకు కారణ మేమి? పూర్వము స్త్రీలకు పునర్వివాహముగాని వివాహ విచ్ఛేదముగాని యుండినయెడల అర్జునుడు భ. గీ.1 అ 42 శ్లో॥ అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః । స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ సంకరో నరకాయైవకులఘ్నానాంకులస్యచ। పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥ దోషైరేతైఃకులఘ్నానాం వర్ణసంకర కారకైః । ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ అను ప్రకారం అధర్మవృద్ధియైనయెడల కులస్త్రీలు చెడుదురనియు స్త్రీలు దుష్టులుఅయిన యెడల వర్ణసంకరమగుననియు అందువల్లపితృదేవతలకు పిండోదకక్రియలుచేయువారుండరనియు యెన్నటికి మార్పుజెందనిశాశ్వత మయిన బ్రాహ్మణాది వర్ణములున్నూ వారలలో అంతశ్శాఖలలోని ధర్మములున్నూ చెడుననియు విచారపడనలసిన ప్రసక్తియుండదు.

అనేక రహస్యవిషయములను సగా అర్జునునికి బోధించిన శ్రీకృష్ణుడు స్త్రీలకు పునర్వివాహములుగాని, వివాహవిచ్ఛేదముగాని

ష్యుండగా నీవు విచారింపవలసినదేమని నుడువకుందువా? గనుక భగవద్గీతలనుబట్టివిచారించినను స్త్రీలకు పునర్వివాహముగాని వివాహవిచ్ఛేదముగాని లేదని తెలుచున్నది. ఉత్తర రామాయణములోనున్న ప్రకారము అధర్మ ప్రవర్తకుడగు రావణాసురుడు అనేకులయిన యితర స్త్రీలను చెరబట్టుటకు వెళ్ళియున్న సమయములో సహోదరియగు కుంభీనస అనుదానిని మధుడను రాక్షసుడు బలాత్కరించి రాక్షస వివాహవిధిచే గొనిపోయెను. అంతట రావణాసురుడు వచ్చిన వెంటనే రౌద్రావేశముచే మధుడను వానిని చంపుటకు దండెత్తి వెళ్ళియుండగా సహోదరియగు కుంభీనస శోకాక్రాంతచిత్తమై ఉ॥ కన్నులశోక బాష్పములు గ్రమ్మగబల్కె మధుండు బల్మినన్నిట దెచ్చుకొన్నపుడె వాడిభుండయ్యె నతండు క్రూరుడైనన్ నన్నుజూచి తాలుటయే న్యాయముగాదని తుంచితేని నోయన్న సహింపనేర్తు నటియన్న మహావిధవాత్మదుఃఖముల్॥ అనిరావణుని మధుని చంపవద్దని వేడుకొనుటయు వానిని చంపినయెడల తాను వైధవ్య దుఃఖము అనుభవించ లేననుటయు అంతట రావణుడు సమ్మతించి వానిని సంహరించక వదలివేయుటయుబట్టి విచారించగా అప్పటికి స్త్రీలలో పునర్వివాహముండిన యెడలకుంభీనసవైధవ్యయోగముభరించలేనని దుఃఖించకనియుండునా? రావణుడైనను తనపరాక్రమమునుసహించగూడనాతటికిక్రూరుడైనమధుడనువాడు చేసిన అక్రమమునువానినివధించియుండితిరిగినీకుమరియొక యోగ్యుడైనభర్తను చేసెదనని చెప్పలేకపోవుటచే వివాహవిచ్ఛేదముఅనునది కూడ లేదనియు తెలుచున్నది. పూర్వము సనాతనులలోనెగాక అక్రమ ప్రవర్తకులగు రాక్షసులలో కూడ స్త్రీపునర్వివాహముగాని వివాహవిచ్ఛేదముగాని లేనట్లు స్పష్టమగుచున్నది. పైన వివరించిన అనేక కారణములచే స్త్రీలకు రజస్వలానంతర వివాహములుగాని పునర్వివాహములుగాని వివాహ విచ్ఛేదముగాని వర్ణసంకర వివాహములుగాని చేయుట సనాతనధర్మవిరుద్ధముగాన చెయ్యకూడదు. పూర్వపు ధర్మశాస్త్రకర్తలు నియ

మ యుక్తులైన సాత్విక సంతానవృద్ధియైన యడల లోకోపకారులగు దురనిన్ని రజోతమోగుణ సంతాన వృద్ధియైన యెడల లోకనాశకులగుదురనిన్ని తలంచి అట్టి నిబంధనల నేర్పరచిరి.

సనాతనధర్మ నియమ వర్తులైన స్త్రీపురుషులకు స్పర్శానందమూలమైన సత్సంతానము కలుగు విధానమును గురించి.

సత్సంతానము కలుగు విధానమును వివరించబడుచున్నది. గర్భధారణ యోగ్యత కలుగునట్టి ఋతుకాలనిర్ణయ గుర్తుగా ప్రథమ రజస్వలయైన స్త్రీ ఋతు నియమముల ప్రకారంవర్తించని యెడల సంతాన భంగ కరములగు ఋతు శూలాది రోగ గ్రస్తులగుదురు. ఋతు నియమములనగా పగలు నిద్రించుట, ఏడ్చుట, పరుగెత్తుట, విశేషముగ మాట్లాడుట, హెచ్చుగనవ్వుట, మొదలైనవికూడదు. మధురపదార్థములు న్నూ ఋతు రక్తస్రావసాధనములగు నువ్వులుచిమ్మిలి, పులగము మొదలైనవి మాత్రమే తినుట నియమములు పాటించవలెను. స్త్రీలురజస్వల లగుటకున్నూ అప్పుడు వారిని అస్పృశ్యులుగా యెంచి దూరముగా నుంచుటకున్నూ కారణమేమనగా విశ్వరూపుడగు పురోహితునిని ఇంద్రుడు చంపగా సంభవించిన బ్రహ్మ హత్యాదోషమును నాలుగు భాగములు చేసి భూమియందును, వృక్షములయందును, నదులయందును, స్త్రీలయందును, ఒక్కొక్క భాగమును వుంచి వరదాన పూర్వకముగా వారలను భరించునట్లు చేసెను. అట్టి బ్రహ్మ హత్యాదోషము భూమియందు గడ్డిపోచయైనను మొలవని ఊసరక్షేత్రముగను వృక్షముల యందు జిగురు రూపముగను నదులయందు కర్కాటక మాసములో అతికల్మషమగు నురుగు రూపముననను, స్త్రీలయందు నెలకు మూడు రోజులు రజోరూపముననను బయలుదేరెను. అవిబ్రహ్మహత్యాదోష జనితములుగాన స్పర్శాదులు నిషేధించబడెను. రజస్వలా స్త్రీలకు మొదటి మూడురోజులు విశేష దోషయుక్తములగుటనుబట్టియింటికి దూరముగ నుంచుటయే గాక దేవతాకార్యములందు దర్శన సంభాష

గాములు కూడ వర్జించబడెను. శ్లో॥ ప్రథమే హని చండాలీ, ద్వితియ్యే బ్రహ్మఘాతిని, తృతియ్యే రజకీ ప్రోక్తా చతుర్థే హని (శుద్ద్యతి) శూద్రికా భవేత్॥ అనగా రజస్వల ప్రథమ దినమందు చండాల స్వభావము గలవారల నుత్పత్తికా తగిన రక్తస్రావము గలదిన్ని ద్వితీయ దినమందు బ్రహ్మహత్య చేయదగిన వారల నుత్పత్తికాదగిన రక్త స్రావము గలదిన్ని తృతియ్య దినమందు గ్రామచండాలు రనదగిన చాకలవాని స్వభావము గలవారల నుత్పత్తి కాదగిన రక్తస్రా వము గలదిన్ని యగును. నాలుగవ దినమందు స్నానాదులచే కొంత పవిత్రత కలిగినప్పటికి శూద్ర స్వభావముగల వారినిన్ని అల్పాయు వయు, దరిద్రముగలవారల, నుత్పత్తిజేయు రక్తస్రావము గలదిన్ని అగును గనుక ఆదినమందున్ను హవ్యకవ్యాదులయందు అప వితృముగా నెంచబడెను. పై కారణములచే మొదటినాలుగు దినములు సంభోగముకూడదు. ఋతురాత్రులైన పదహారుదినములలో పదకొండవ రోజున్ను పదమూడవరోజున్ను సంగమించిన యెడల దుర్మార్గ ప్రవ ర్తకు రాండ్రున్ను వర్ణసంకర కారకులున్ను అగు స్త్రీలు జనించు దురు గాన ఆరెండు రాత్రులున్ను సంభోగముకూడదు. తక్కిన బేసి దినములగు అయిదు, ఏడు, తొమ్మిది, పదిహేనవదినములు స్త్రీసంతా నోత్పత్తి కాదగిన అధికరక్తోత్పత్తియగుటచే స్త్రీ సంతానము కలుగునట్టివిగానున్నవి. సమ దినములగు ఆరు, ఎనిమిది, పది, పన్నెండు, పదునాలుగు, పదహారు, అల్పరక్తోత్పత్తిగల దినములగుటచే పురుష సంతానము కలుగునట్టివిగ నున్నవి. పదునాలుగు పదహారు రాత్రుల యందు నిలిచినగర్భమునందు బ్రహ్మవిద్యాధురంధరులు జన్మించుదురు- పగలు, సంధ్యాకాలము నిశిరాత్రియుసంగమించిన యడల లోకాప కారులున్ను రాతసకృత్యములు గలవారలున్ను జన్మించుదురు- గనుక సంగమించకూడదు. కృష్ణాష్టమి, ఏకాదశి, కృష్ణచతుర్దశి; అమా వాస్య పూర్ణిమసంక్రాంతి,వ్యతీపాత మొదలగుపర్వ దినములయందుసంగ

మించిన యడల పురుషుడు వీర్య హీనుడుగానుండును. వీర్యమునందు సత్వములేకుండుటచే దుర్బల సంతానము గాని అల్పాయుర్దాయులు గాని జన్మించుదురు గనుక ఋతు రాత్రులైనప్పటికి పర్వకాలముల యందు సంగమించ గూడదు. భాగవతము తృతీయస్కంధములోనున్న ప్రకారం కశ్యపునిభార్య దితిసాయం సంధ్యాకాలమందుబలాత్కరించి రమించుటచే అతి క్రూరులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు జన్మించిరి- ఉత్తరరామాయణములోనున్న ప్రకారం విశ్రవసుబ్రహ్మనుకైకసిసంతానార్థియై సాయం సంధ్యా కాలమందు మోహాదృష్టిచె దర్శించుటచే క్రూరులైన రావణ కుంభకర్ణులు జన్మించిరి. శ్రీమదాద్రిమాయణము యుద్ధకాండలో వివరించిన ప్రకారం శ్రీ ధాన్యమాలినియను దేవతా స్త్రీని రజస్వాలా ప్రథమదినమందు రావణుడు బలాత్కరించి రమించుటచె దేవబ్రాహ్మణ విద్వేషియై క్రూరుడైన అతికాయుడుద్భవించెను. పైన వివరించిన వివిధములయిన నియమములు పాటించ లేనివారికి దుష్ట సంతానము కలుగును అని మనువు వచించియుండెను.

పురుషుడున్నూ ఆరోగ దృఢగాత్రుడై యుండి బ్రహ్మచర్యమును పాటించుచు యోగ్యదినముల యందే సంగమించవలెను. గర్భోపనిషత్తులోవివరించినప్రకారంశుక్లముఅధికముగానుండినపురుషుడున్నూ రక్తము అధికముగానుండిన స్త్రీయును శుక్లము రక్తము సమముగానుండిన నపుంసకుడున్నూ జన్మించుదురు. శ్రుతి "వ్యాకులతమనోభ్యా" అనగా భయము, దుఃఖము మొదలైనవాటిచేవ్యాకులతమనస్సుగలవారలు సంగమించిన యడల గ్రుడ్డివారును కుంటివారును మరిగుజ్జువారును పొట్టివారును అంగవికలులును జన్మించుదురు గనుక సంగమయోగ్యములగు ఋతు రాత్రిలలో పర్వకాలములను వదలి భార్యాభర్తలు సంతోషచిత్తులై సంపూర్ణ ఆరోగ్యవంతులై యుండి సంగమించిన యడల దృఢకాయులున్నూ యోగ్యమైన సంతానములున్నూ కలుగును. పదరు నియమములకు లోబడిన రోజులు నెలకు వకటి రెండు దిన

ములకంటె అధికముగా దొరకుట దుర్లభమగుటచే ఆప్రకారము వర్తించు స్త్రీపురుషుల ఆరోగ్యము చెడకుండ దృఢకాయులుగ నుందురు. స్త్రీలు ప్రథమరజస్వలలైనప్పటికి సంపూర్ణ యవ్వనము రానిదీ గర్భాధానము చెయ్యగూడదనిన్ని అట్లు చేసిన యెడల దుర్బలులై సంతానము కనుటలో ప్రసవించ లేక మరణించుట గాని దుర్బలసంతానము కలుగుననిగాని యెంచి గర్భాధానము చెయ్యగూడదనుట ఆలోచనాంశము కాదు. ఏమనగా గర్భధారణకాల నిర్ణయ గుర్తుగానుండి ప్రథమ రజస్వలయైన స్త్రీని గర్భాధానము చెయ్యకుండ యెంతకాలముంచినను రోగాదులచే దుర్బలురాలై యుండినస్థితిలో సంగమించుటచే గర్భధారణ యగు నెడల అట్లైజరుగును. తుదకు పూర్ణ యవ్వన ప్రౌఢాస్త్రీయైనను రోగాదులచే బలహీనురాలై యుండిన స్థితిలో సంగమించగా గర్భధారణయగు నెడల ప్రసవకష్టముచే మరణించుటగాని తత్తుల్య కష్టముగాని అనుభవించక తప్పదు. యిట్టి కేసులు అనుభవములో అందరు యెఱిగియే యున్నారు. పై సంగతి సందర్భములన్నియు వారి వారి బాధ్యస్థులైన తల్లి దండ్రులుగాని వారలలో వారలుగాని యోచించుకుని స్త్రీపురుషులు సంగమించవలసియున్నవి. అట్లుగాక స్త్రీపురుషులు వుభయులు సంపూర్ణ ఆరోగ్యవంతులై యుండినట్లు డాక్టరు సర్టిఫికెట్టు పొందనిది సంగమించ కూడదను నిర్భంధశాసనము చేయించినట్టుగ నే ప్రథమరజస్వలానంతరము గర్భాధానము చెయ్య గూడదనుట యునట్లేయుండును. నిష్కపటహృదయముతో నిజమును తెలుసుకొన ప్రయత్నించు స్త్రీపురుషులందరుతమకు యేవయస్సులో కామేచ్ఛ గలిగ యెట్లు ప్రవర్తించిరోఁజ్ఞప్తియుంచుకొని అట్టిరహస్యవిషయములనుసగా ఆయామతకట్టుబొట్లచే నియమించబడవలసినవియే గాని బహిరంగ ప్రభుత్వశాసన మూలముగా నిర్బంధించజూచుట అసాధ్యమనియు గ్రహించకపోరు. "స్త్రీ క్షేత్రంబీజినోనరాః" అను ప్రకారం స్త్రీ క్షేత్రము వంటిది. పురుషుడు బీజముగా నున్నాడు. క్షేత్రబీజగుణములు రెండును

సంతానమునకు పట్టుబడును. జీవశక్తిగల పురుషునియొక్క అనేక రక్త బిందువులు కలసిననే వక శుక్లబిందువగును. అట్టి శుక్లమును నియమాతిక్రమణ సంభోగాదులచే క్షయింపజేసుకొనిన యెడల పురుషులు దుర్బలులగుదురు. అట్టి దుర్బలులకు కలుగు సంతానమున్నూ దుర్బలులగుదురు. యిదివరలో తెల్పిన ఆ యా ఋతుకాలయోగ్యదినముల యందు ఆరోగ్యవంతులై యుండి బుద్ధిపూర్వకముగా సంగమించక మానినయెడల భ్రూణహత్యాదోషము జెందును. వివిధములుగాయున్న యిట్టినియమముల ప్రకారం వర్తించలేక ఇంద్రియలోలురై ఆరోగ్యము యిదివరకే చెడియుండి తిరిగి పూర్ణ ఆరోగ్యము యెట్లు కలుగునని పరితపించుచూ నూతిలోనీరుతోడుటకు త్రాడుచాలకుండిన నూతిని పూడ్చవలయునను రీతిగ సంతాన నిరోధముకావలె, జిహ్వేంద్రియ అనిరోధము కావలెననే సనాతనధర్మ వ్యతిరేక స్వేచ్ఛాభిప్రాయులై అనేక నిర్బంధశాసనములు చేయించ జూచుట రాక్షసకృత్యము. శ్లో॥ "అల్లీ, వల్లీ, కర్కట, వేణు, రంభా, వినాశకాలేఫల ముద్భవంతి" అను ప్రకారమున్ను "అధర్మం ధర్మమితియా మన్యసేతమసావృతః అను గీతావచన ప్రకారముగానున్నూ తుమ్మెదకున్నూ, తేలుకున్నూ, యెండ్రికాయకున్నూ, వెదురుకున్నూ, అరటిచెట్టుకున్నూ, మరణమాసన్నమైననే సంతానము కలుగును. అందుకు వ్యతిరేకముగా మాతృనాశన కాలమాసన్నమగుటను బట్టియే సహజధర్మమును, అధర్మముగాతోచి తమోగుణ ప్రధానులు కొందరు సంతాన నిరోధము చెయ్యవలసినదనిన్ని అందువల్ల స్త్రీలు ఆరోగ్యవంతులు, దృఢకాయులున్నూ అగుదురనే మొదలగు సంగతులుచెప్పుచూ ప్రచారము చేయుచున్నారు. శ్రుతి॥ 'ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః' అనగా సృష్ట్యాదినుండి పారంపర్యముగావచ్చు ప్రజాతంతువును త్రెంచి వేయకుము' అనగా సంతానవిచ్ఛిత్తి చేయకుము. అను ఆజ్ఞాపూర్వకమయిన విధి నిరూపించుచున్నది. దానినిబట్టి శాస్త్రీయవివాహ బంధ

వయుతోనున్న స్త్రీ వలన సంతానము కనవలెనని తెలుపుచున్నది. గాని ఒకటి రెండు సంతానములు కనిన పిమ్మట నిరోధించవలయునని విధి యెక్కడను లేదు. లేక అసలే నిరోధించుననే యెడల ప్రజావృద్ధియే కాకపోవును. కొందరి స్త్రీలకు సక్రమమాత్రము ప్రయత్నము లెన్ని జేసినను సంతానము కలుగకుండుటయు, కొందరికి అల్పసంతానము కొందరికి బహుసంతానము కలుగుచున్నది. "ఋణానుబంధ రూపేణ పశుపత్నిసుతాదయః" అను ప్రకారం పూర్వులలో యెందరు జన్మలకు రానైయున్నారో మనము తెలుసుకొన సాధ్యము కాదు గనుక శాస్త్ర విధి ననుసరించి సంగమించుటయే మానవవిధియైయున్నది. అట్లు అందరు శాస్త్రవిధి ననుసరించుచున్నారా అనిగాని అట్లు నిర్బాధముగా నుండ గలరా యనిన, అట్లు ఆచరించువారలే యోగ్యసంతానము బడయు దురు. అశక్తులు యెంతవట్టుకు ఆచరించగలిగిన అందుకు తగినమిశ్రము సంతానమునే బడయుదురు. బహువుంది సంతానము కలుగుచున్నది గదా యని దానిని ఓషధులు మొదలైనవాటిచే నిరోధించుట సాధ్యమగు నని నిష్కర్షగా చెప్ప వీలులేదు. ఒకవేళ అట్లు నిరోధించగలిగినను యితర విధమయిన జబ్బులు కొన్ని కలుగకమానవు. సంభోగమును వర్జించినయెడల సంతాననిరోధము కలుగును. సంభోగమును వర్జించ గల దృఢీకృత మనస్కు లుండుటయరుదు. ఇంద్రియ లోలురై ఋతు నియమాదులను పాటించక ఆయా ఋతు ధర్మము ననుసరించి ఆయా కాలములయందే తప్ప యితర కాలములయందు సంగమించని పశ్వాదుల కంటెను అక్రమముగా సంచరించువారలు సంభోగము వర్జించగలరా? అయినను తాను మొదట ధర్మప్రజావృద్ధికొరకని వివాహము చేసు కొనుట యనుదానికి భిన్నముగా యికముందు, జన్మలకు రావలసిన వారిని రాకుండ నిరోధించినట్టి పాపకారణులగుదురు. సంతానార్థము సంభోగించుచున్న పార్వతీ పరమేశ్వరులకు విఘ్నము కలుగజేసిన దోషమువలన శాపగ్రస్తులై దేవతలందరు సంతానహీనులైనను

సంభోగ సౌఖ్యము ననుభవించువారుగ నున్నారు. వారిలో దేవతా భోగ స్త్రీలగు రంభ, పూర్వసి తిలోత్తమ మేనకాదులు నిత్యయవ్వనులై స్వేచ్ఛాసంభోగముల ననుభవించుచున్నారు. వారివలెనే సంతాన నిరోధము చేసుకొనినయెడల చిరకాల సంభోగ సౌఖ్యము లనుభవించ గలమనుకొనుటకూడ అవివేకము గానున్నది. యేమనగా ఈశరీర మున్నూ నిత్యమయినది కాదు. 'స్త్రీణాంయవ్వనమధ్రువం' అనుప్రకారం యవ్వనమున్నూ స్థిరముగా నిలుచునది కాదు. మబ్బు వేసినదిగదా వర్షము కురియునని తలంచి చెరువులోని నీరును పోగొట్టినట్లగును.

జ్యోతిశ్శాస్త్రము ననుసరించి పూర్వజన్మయందు చేసుకొనిన సంతాన నాశనకరములగు వివిధములైన పాపములచే సంతాన నాశన మగునని వివరించుటలో అట్టి దోషములలో నొకటియగు క్రూరజంతువు లైన సర్పముల విషయములో శ్లో॥ సర్పసంహార దోషేణ కులక్షయక రంభవేత్, ఏకమాసశిశోర్నాశ మేకాబ్దశిశునాశనం । శతద్వయోర్ధ్వ సర్పశ్చతుశ్చత్వారి సంఖ్యకం । అండం సర్పస్య విజ్ఞేయం దోషస్యా దండనాశనే । ఏకాండం నాశనేచైవ ఏకగర్భస్య నాశనం, తాధా సర్పస్యచాండస్య ప్రైకైకస్య యధాక్రమం -అనుప్రకారం పూర్వజన్మల యందు సర్పములను సంహరించిన దోషముచే కులనాశన మగుననియు ఒకమాసముగల సర్పశిశువును సంహరించిన ఒక సంవత్సరము వయస్సు గల సంతానము నష్టమగుననియు, రెండు మాసముల సర్పశిశువును సంహరించిన రెండు సం॥రముల వయస్సుగల సంతానము నష్టమగునని యు యిట్లూహ్యంబులు. సర్పము రెండువందల నలుబదినాలుగు గ్రుడ్లు పెట్టుననియు అట్టివానిలో యెన్నిగ్రుడ్లను నాశనము చేసియుండిన తాను సంతానములో భార్యకు అన్ని గర్భస్రావము లగుననియు, అదిఒక జన్మలో పూర్తికాని యెడల కొన్ని జన్మలవరకు అనుభవించవలయు ననియు· మొదలైన సంగతు లున్నవి. వాటినిబట్టి చూడగా క్రూరజంతు వగు సర్పాండనాశన దోషముకె ఘోరమగు యింత పాపానుభవమగు

చుండగా సంతాన నిరోధము చేసియుండి సంభోగ సౌఖ్యము మాత్రమే యనుభవించ కోరువారికి అన్ని జన్మలలో నుత్తమమయిన మనుష్య జన్మకారణ బీజమగు శుక్ల రజోస్ఖలనరూపమయిన యెన్ని భ్రూణ హత్యలు చేసియుండి యెట్టిపాపము అనుభవించవలయునో నిర్ణయించ సాధ్యముకాదు గనుక ఘోరపాపమున్నూ రాక్షసకృత్యమునగు సంతాన నిరోధము చేయుట కూడదు. శ్లో॥ ఆహార నిద్రాభయమైథునాని సామాన్యమే తత్ పశుభిర్నరాణాం । జ్ఞానీ నరాణా మధికో విశేషః జ్ఞానేన హీనపశుభిస్సమానః॥ అనగా ఆహారము, నిద్ర, భయము, మైథునము, వీటియందు కోరిక, మనుష్యులకున్నూ పశువులకున్నూ సమానముగానే యుండును గాని విశేషమేమనగా వాటివాటియందు యుక్తాయుక్త జ్ఞానముతో సంచరించు మనుష్యులు యోగ్యులుగా నున్నారు. అట్టి జ్ఞానముయుండక స్వేచ్ఛా ప్రవర్తకులగు వారలు పశువులతో సమానమగుదురనియు ఉత్తర గీతావచన మున్నది.

అస్పృశ్యులగు చండాలాదులు పవిత్రమగు దేవాలయములో ప్రవేశించ గూడదనుటగురించి.

యీ విషయములో విమర్శించుటలో (1) దేవాలయములు అనగా నెట్టివి (2) అస్పృశ్యజాతులు అనగా నెట్టివి (3) అట్టి అస్పృశ్య జాతులు పవిత్రదేవాలయములలో ప్రవేశించకూడునా అను హంశములు వకదాని తర్వాత నొకటి విమర్శనీయములుగా నున్నవి.

(1) దేవాలయములు అనగా నెట్టివి. దేవాలయములలో కొన్ని అనాదిగా పేర్కొనబడిన శ్రీకాశీ మొదలయినవి స్వయంవ్యక్తములనియు గురువాయూరు మొదలయినవి కొన్ని దేవతా ప్రతిష్ఠితములును కొన్ని మహాఋషిప్రతిష్ఠితములును కొన్ని మనుష్య ప్రతిష్ఠితములును మొదలయినవి వకదానికంటె వకటి న్యూనతేజోశక్తి కలవిగా నున్నవి. అవి ప్రతిష్ఠించినవారి తపోశక్తిని బట్టి న్యూనాధిక తేజోవంతములుగా నున్నవి. ఏయే దేవాలయములు ఎవరు ప్రతిష్ఠించి

యున్నను శృతి స్మృతి, పురాణ, ఆగమశాస్త్ర విధులచే ప్రతిష్ఠించిన వాటినే దేవాలయములుగా నెన్నబడును. తదితరములు దేవాలయములుగా పరిగణించబడవు. అట్లు ప్రతిష్ఠించబడు దేవాలయములు నగా అధమము త్రిరాత్రమైనా దీక్షచేసి ఆయా సమయముల యందు లభించువారిలో యోగ్యులయిన బ్రాహ్మణులను నియమించి ఆయా దేవతామూర్తి స్థిరీకరణార్థమున్నూ, అందుకు సంబంధించిన యితర పరివార దేవతాదుల యొక్కయున్ను, మంత్ర జపయంత్ర తంత్రములచే దేవతా సాన్నిధ్యము, లేక పవిత్ర తేజస్సును లేక ఈశ్వరశక్తిని కలుగజేసి ఆయా దేవతా మూర్తులను శాస్త్రపద్ధతిని ప్రతిష్ఠించ బడియున్నవి. అట్లు ప్రతిష్ఠించిన వాటి యందు ఆయా దేవతా మూర్తివంతము లేక పవిత్ర తేజస్సును కలదని శృతి, స్మృతిపురాణ ఆగమశాస్త్ర దృష్టమేగాని యెవరికిన్ని దృష్టిగోచరముగాదు. అట్టి శృతి, స్మృతి పురాణ ఆగమశాస్త్రాదుల యందే అస్పృశ్యజాతులు దేవాలయములలోపల ప్రవేశించగూడదని విధించిన ప్రకారము వర్తించకయున్నా వాటియందు బొత్తుగానమ్మకము లేనివారున్నూ, అయిన అస్పృశ్యజాతులకు అవి దేవాలయములే కాక పోవలసి యుండును. అట్టిస్థితిలో ఆయాదేవాలయములలోనికి వెళ్ళి ఆయా దేవతామూర్తులను దర్శించకోరుట నిష్ప్రయోజనమేగాక వాటి పవిత్రతనుకూడా భంగము కలుగజేసినవారగుదురు. మరిన్ని శివాలయములలోనికి వైష్ణవులును, విష్ణ్వాలయములలోనికి శైవులును, ప్రవేశించరు. కొన్ని దేవాలయములలోనికి ఆ యర్చకులేతప్ప యితర బ్రాహ్మణులు నగా ప్రవేశించరు. యిట్టి ప్రవేశార్హతానర్హతలు బ్రాహ్మణులలోనే కలిగి యుండగా తదితరులున్నూ అస్పృశ్యజాతులున్ను తమ్మును దేవాలయ ములలోనికి రానివ్వలేదని నిందించుట న్యాయముకాదు.

(2) అస్పృశ్యజాతులనగా నెట్టివి. అస్పృశ్యులు అనగా తాకుటకు తగనివారని యర్థము. వారలు సృష్ట్యాదినుండి యిప్పటివరకు

పారంపర్యము అస్పృశ్యులుగా యేర్పడి గ్రామ బహిఃప్రదేశముల యందు నివసించుటయు, వారలు తమ అస్పృశ్యత నివారించుడని యిప్పుడు కోరుచుండుటయు కారణములచే చిరకాలానుభవముగ అస్పృశ్యులుగా నున్నారనుట నిర్వివాదాంశము. వీరలను గురించి యిదివరలో వ్రాయబడియున్న అస్పృశ్యతాంశములువలన తెలియ గలదు. మరియు పరాశరుడు శ్లో॥ ఆసనాచ్ఛయనాద్యానాద్భాషణాత్, సహభోజనాత్ సంక్రమంతిహి పాపాని తైలబిందురివాంభసి॥ అనగా యేప్రకారము నీటిమీద తైలబిందువు వేసినమొదల శీఘ్రముగా అంతటా వ్యాపించునో అదేవిధముగా కలసి కూర్చుండుటయు, పరుండుటయు, నడచుట, మాటలాడుట, కలసి భోజనము చేయుట అనువీటివలనవకరిపాపము వకరికి సంక్రమించు ననియు చెప్పియున్నారు. తమకు అన్నివిధముల నుపచరించు భార్యను సగా బహిష్ఠు అగుట తోడనే శాస్త్ర మర్యాద ననుసరించి దూరముగా నుంచు చుండుటచే చండాలురయందలి అస్పృశ్యత ద్వేషమూలకము అనతగదు.

అయినను "ఆచార భ్రష్ట దేహానాం భవేద్ధర్మ పరాఙ్ముఖః" అనునట్లుగా యిదివరకే ఆచారభ్రష్ట దేహులయిన అస్పృశ్యత పాటించని వారలు కొందరు వాదించు విధమేమనగా బ్రహ్మభావమునందు దృఢీకృత మనస్కులగుటకుగాను వదలవలశిన కర్మలు యేవియో బోధించినట్టి భ॥ గీ॥ 5 అ॥ కర్మసన్యాసయోగములో చెప్పబడియున్న 18 శ్లో॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని, శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శనః॥ అనగా ఉత్తమ, మధ్యమ, అధమ నిర్ణయక్రమముగాను, హరించబడి యున్న విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవుయందును, ఏనుగుయందును, కుక్కయందును, కుక్కమాంసము సగావండి తినునట్టి స్వభావముగల చండాలుని యందును, పండితులు బ్రహ్మమును దర్శించు వారగుదురు. అనునట్టి అర్థమును వ్యతిరేకముగా యిక్కడి సమశబ్దమును బ్రహ్మపరముగా

నర్థము చెయ్యక సమానను అని అర్థము చెప్పుచు పైవాటి అన్నిటి యందు పండితులు స్పర్శాది భేదములేక శ్వపాకాదులతో సమానముగా వర్తించుదురనియు అట్టి భేదము నెంచువారలు పాపకులేననియు విపరీతముగా వాదము చేయుచుందురు. అది యేమాత్రము యోగ్యము కాదు. అట్టివారి వాదము ప్రకారమైనను అవి అన్నియు యే యే విషయములలో సమానములో యోచించ తగియున్నది. వాటివాటి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులలో వేటియందును సమానములు గాక వివిధ భేదములు గలిగియున్నవి. ఆహార విహార జల పానాదుల యందును, శరీరబలమునందును సమానములు గావు. వాటిలో గోవు వలన సంభవించు పంచగవ్యములు అనగా పాలు, పెరుగు, నెయ్యి, మలము, మూత్రము అతి పవిత్రములుగా అనుభవించునట్లు; కుక్క మొదలగు తక్కిన వాటిని అనుభవించుటకు అయోగ్యములు, అపవిత్రములు, నిషేధయులుగా నున్నవి. ఏనుగు దంతములు శల్యములు గ్రహించునట్లుగా తక్కిన కుక్క మొదలగు వాటి శల్యాదులను యెవరును గ్రహించరు. పరిశుద్ధము చేసిన గోచర్మమువలె తక్కినవాటి చర్మములుపయోగించవు. ఏనుగును స్పర్శించుటలో మనుష్యాదులకు ప్రాణాపాయము రాజాధిరాజులు వాహనముగా నుపయోగించు ఏనుగువలె తక్కినవి ఉపయోగించవు. యికను వేటియందు సమానముగా నెంచుదురో వూహించజాలను. యెవరికిన్ని దృష్టిగోచరముగాని అన్నిటి ఆత్మలు సమానమేనని చెప్పుచు అంతమాత్రముచే వాటి వాటి శుక్ల శోణితములచే జన్మించి పరిశుద్ధాపరిశుద్ధములు పవిత్రా పవిత్రములు ప్రత్యక్షముగా కనిపించుచున్న వాటివాటి దేహము లన్నియు సమానము అనుట అవివేకము లేక నిజముగా అట్టి దృఢీకృతులైన వారలు పైవాటిలో నిదే యగు కుక్కనుగాని యే యితర విగ్రహమును గాని భక్తి శ్రద్ధలతోను, స్పర్శాదులతోను, ఆరాధించక తిరిగి చంచల మనస్కులై బ్రాహ్మణాదులను తాకుటకున్నా వారి

చేతనే ప్రతిష్ఠించబడిన పవిత్రమైన దేవాలయములలో ప్రవేశించుట కున్నూ, అస్పృశ్యజాతులను ప్రవేశపెట్టుటకున్ను యత్నించుట ద్వేష మూలమనుటకు సందేహము లేదు. పైనవివరించినశ్లో కార్థమునువివరముగా రూఢియగునట్లు బ్రహ్మభావమునందుమనస్సునుదృఢీక్రుతముగానిల్పుటను వివరించినట్టి భ. గీ. 6 అ. ఆత్మ సంయమయోగములో 29 శ్లో॥ సర్వభూతస్థ మాత్మానంసర్వ భూతాని చాత్మని । ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ అనగా సర్వభూతములయందు తనను తనయందు సర్వభూతములను యోగయుక్త మనస్సు గలవారలు అంత టను బ్రహ్మభావముతో చూచుచుందురు అని యున్నది గనుక అట్టి బ్రహ్మభావముతో వాటి వాటిని దర్శించుటయందు మాత్రమే సమా నములుగాని తక్కిన స్పర్శాదుల వేటియందు సమానములనుటకు వీలు లేదు. అట్లు బ్రహ్మజ్ఞానులు మాత్రమే దర్శించగలుగుదురు గాని సామాన్యులందరికి శక్యము కాదు. అట్టి బ్రహ్మజ్ఞానులు ప్రపంచ విషయ మైన అన్నికర్మలయందును విముఖులుగానే యుందురు. అయినను అట్టి వారితో సామాన్యులందరు పోల్చుకొనకూడదు. గనుక జన్మచేతనే జాతి నిర్ణయము అనుటలో అస్పృశ్యజాతులు పారంపర్యక్రమాగత మైన జన్మచేతనే అస్పృశ్యులుగా నున్నవారనుట నిర్వివాదాంశము.

(3) అట్టి అస్పృశ్యజాతులు పవిత్ర దేవాలయములలో ప్రవే శించకూడదునా ? అనునది విమర్శించ బడుచున్నది. అస్పృశ్యజాతులు చాతుర్వర్ణ్యులకు స్పర్శకు అర్హులు కారనియు, వారలయందు దుష్ట తేజస్సు కదలనియు, వివరించియుంటిని. దేవాలయములు పవిత్ర తేజస్సుకల వనియు, వాటిపవిత్ర తేజస్సునకు భంగము లేకుండునట్లుగా ఆయాజాతులకు తగిన శాస్త్రబద్ధదూర వ్యవస్థతతో దర్శించ వచ్చును. అట్లు శాస్త్రబద్ధులు గాక అస్పృశ్యులు దేవాలయములలో ప్రవేశించిరేని వారికి పుణ్యము లేదుసరేకదా, విశేష పాపము సంభవించును. ధర్మసింధువు వృద్ధమనువు శ్లో॥ గర్భాగారాద్బహిః స్థిత్వా తథా ప్రాకారాత్తోంతతః । చండాలాద

నా త్సద్యః ద్దేవోద్బింబా తృలాయతే॥ అనగా చండాలురు దేవాలయములలో ప్రవేశించి గర్భగృహమునకు వెలుపలనుండి దేవుని చూచినను దేవతా బింబమునుండి దేవతా సాన్నిధ్యము తొలగిపోవును. అని యున్నది. కారణాగమము ప్రాయశ్చిత్తకాండములో శ్లో॥ రుద్రస్యవా ధఃష్ణోర్వా ప్రాకారాభ్యంతరేయది। రజస్వలావధూశ్చైవ చండాలాస్య సమాగతః। తతో గ్రామోత్సవే హస్త శతాభ్యంతరతోయది। తద్దేతస్య కళాహానిః రాజ్ఞో మరణమేవచ॥ తద్గ్రామస్యక్షయం ప్రోక్తం సస్యానాం నాశనంధృవం॥ అనగా శివ విష్ణు దేవాలయముల ప్రాకారముల లోపల రజస్వల అయిన స్త్రీగాని చండాలునుగాని, ప్రవేశించినను, గ్రామోత్సవము లందు 50 గజముల దూరమునకు లోపుగా వచ్చినను ఆదేవతకు కళాహానియు గ్రామమునకు, పంటలకు, రాజునకు కీడు సంభవించుననియు మొదలయిన శాస్త్రస్పష్టములు అనేకములు గలవు. గ్రంథ విస్తర భీతిచే విరమించడమయినది. అంత మాత్రముచే చండాలాదులకు దేవతా దర్శనము కూడదని కాని, పుణ్యము సంపాదించు కొనగూడదని కాని శాస్త్రములయందు విధించలేదు. ఏమనగా కారికావృత్తి నీలకంఠాచార్య సంగృహీతము శ్లో॥ వైశ్యానామపి శూద్రాణాం భద్రమంటపసేవితం। యితరేషాం తువర్ణానాం గోపురంతు విధీయతే। చండాల పతితా దీనాం గోపురాద్బహిరేవహి। అనగా వైశ్యులు శూద్రులు భద్రమంటపమునందుండి దేవుని సేవించవలెను. చండాలురు పతితులు మున్నగువారు గోపురమునకు వెలుపలనుండియే స్వామిని సేవించవలెను. యివివరలో చెప్పిన ప్రకారం గ్రామోత్సవములందు 50 గజముల దూరములోనుండి స్వామిని సేవించవలెను. ఒక ప్రభువును దిగువ ఉద్యోగులున్నూ, ప్రజలున్నూ యెట్టి తారతమ్యతతో దర్శించుదురో అట్లే దేవుని దర్శించు వ్యవస్థలున్నూ యేర్పరచబడినవి. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అను ప్రకారము బ్రాహ్మణాది చాతుర్వర్ణులు నగా గోపుర దర్శనము

చేతనే పునర్జన్మ లేదని యున్నది. అట్లు శాస్త్రమర్యాద నతిక్రమించక చండాలురు మొదలయినవారలు దేవుని సేవించిన యెడల తక్కిన వారితో పాటు దేవతానుగ్రహము కలుగుననియు అవి దేవాలయము లుగా ప్రతిష్ఠింపబడిన శాస్త్రములలోనే విధించబడియుండగా శాస్త్ర యుక్తి అనుభవములకు విరుద్ధముగాను దేవాలయ ప్రవేశము జేసెద మను అస్పృశ్యజాతులను వారిని దేవాలయములలో ప్రవేసింపచేయు టకు ప్రయత్నించువారును శాస్త్ర నమ్మకము లేనివారుగా నున్నారు.

అట్టి శాస్త్రనమ్మకము లేనివారి యోచనకు అవి దేవాలయ ములే కావని గూఢాభిప్రాయముతో నున్నట్లు యెంచదగియున్నది. అట్లు శాస్త్రనమ్మకములేని అస్పృశ్యజాతులు మొదలగువారు తమకు దేవతా భక్తియున్నట్లు నటించుచూ దేవాలయములలో ప్రవేశించు టకు సిద్ధపడుట విచారించగా పవిత్ర దేవాలయములను అపవిత్రత చేయుటకున్నూ బ్రాహ్మణాది చాతుర్ వర్ణ్యలను తాకి అపవిత్రత కలుగ చేయుటకు మాత్రమే చేయు పన్నుగడగాను అక్రమ చర్య గాను ఉన్నది. ఏమనగా ఆయా దేవాలయములు కట్టించి ప్రతిష్ఠించిన వారలు అస్పృశ్యజాతులు దేవాలయములలో ప్రవేశించ కూడదను నమ్మకముతో నుండి తదాది యిప్పటివరకు జరుగుచున్న వారి అభి ప్రాయములకు వ్యతిరేకముగా జరిగించుటకు యిప్పటి ధర్మకర్తల కున్నూ అధికారములేదు. ఒకవేళ ఆదేవాలయములు ప్రతిష్ఠించిన వారలె యిప్పుడు ధర్మకర్తలుగా నున్నను మొదట యెట్టిశాస్త్ర నియమములకు లోబడి ప్రతిష్ఠించిరో దానికి విరుద్ధముగా యిప్పుడు అస్పృశ్యజాతులను ప్రవేశ పెట్టుటకు వారికిన్ని హక్కులేదు. ప్రభు త్వము వారున్ను ఆయాధర్మములు పూర్వము నిర్దేశించబడిన పారంపర్య క్రమాగతమైన హక్కులు కాపాడి పాలించుటే న్యాయము. అస్పృశ్య జాతులు దేవాలయ ప్రవేశమును గురించియు అస్పృశ్యతా నివారణ మొదలగు వాటిని గురించియు బిల్లులు పెట్టువారును అట్టివాటిని

ఆమోదించుటకు సిద్ధపడువారున్నా సనాతనులుగారు. కేవల సనాతన ధర్మవిరోధులగు ఆర్యసమాజ, బ్రహ్మసమాజ, తత్వజ్ఞాన సమాజాదులలో గాఢముగా చేరియుండి పైకి సనాతనులమని నటించుచూ సనాతన ధర్మ విధ్వంసకులుగా నున్నారు. శాశ్వతమగు మతవిషయమైన చర్చలు ఓట్లమీద పరిష్కరించబడుట న్యాయముకాదు. అట్లయినను యితర మతస్థుల ఓట్లమీద పరిష్కరించ బడుట కేవలంఅన్యాయము. సదా ఇంద్రియ నియమములనే బోధించు సనాతన ధర్మ ప్రచారకుల ఓట్లధికమై ఆప్రకారము వర్తించవలసిన విధి యేర్పడిన యెడల ఇదివరకే ఇంద్రియ లోలురై సంచరించు తక్కిన సమాజముల వారికి యెట్టి ప్రాణసంకటముగా నుండునో అట్లే యితర మతస్థుల ఓట్లధికమై ఆప్రకారము వర్తించవలసి యుండిన యెడల సనాతనులకు కూడిరాని ఘోరకష్టము నష్టము సంభవించునని గ్రహించక పోవుట యెట్టి అహింసా సిద్ధాంతమో నిర్ణయించ సాధ్యముకాదు. సనాతన ధర్మాధారములగు శృతి, స్మృతి, ఆగమ శాస్త్రాదులకు విరుద్ధముగా ఓట్లనిచ్చుటకు సిద్ధపడువారు నేతిబీరకాయ యనునట్లుగా సనాతనులమని చెప్పుకొనుట మోసకృత్యము. నిజమయిన సనాతన ధర్మాభిమాని శాస్త్ర విరుద్ధముగ ఓట్ల నివ్వడు. సర్వజనామోదకులమని చెప్పుకొను కాంగ్రెసువారలు సర్వజనాభిప్రాయమునకు విరుద్ధములగు దైవశాసన రాజశాస నోల్లంఘనాది అక్రమ చర్యావ్యామోహిత భ్రష్టులైన వారలలో కొందరు ప్రస్తుతము నిర్వాహకులుగ నుండ జాలక అస్పృశ్యజాతులను బలాత్కారముగా ప్రోత్సహించి మీకు మహోపకారము చేసెదమని భ్రమింపజేసి దేవాలయ ప్రవేశమని అస్పృశ్యతా నివారణమను మొదలైనవి అనేకములు కల్పించి ప్రజా ప్రభుత్వ వైషమ్యములు దెచ్చిపెట్టుచున్నారు. ఇందువల్ల ఐకమత్యసాధనముగాని అస్పృశ్యజాతులకు కలుగు ప్రయోజనముగాని యేమియున్నలేదు. వారలనుద్ధరించెదమను నెపముచే వసూలుచేయునట్టిలక్షలకొలది

చందాద్రవ్యమును తాము స్వేచ్ఛగా అనుభవించుట మొదలగు దుర్వినియోగము చేయుట ద్రోహకార్యముగా నున్నది. శాస్త్రయుక్తి అనుభవములకు విరుద్ధముగా అనాదినుండి లేని హక్కులను స్థాపించు కొనగోరువారు అస్పృశ్యజాతులుగా నున్నారు. అనాదినుంచియున్న పారంపర్య క్రమాగతమైన హక్కులను యథాస్థితిగా నిల్పుకొనగోరి ప్రయత్నించువారు సనాతనులుగా నున్నారు. ఈ రెండిటిలో యేది సహజధర్మమో పాఠకులే గ్రహించగలరు. యెన్నివిధముల యోచించి నను సనాతన ధర్మము ననుసరించి అస్పృశ్యజాతులకు పవిత్రమగు దేవాలయములలో ప్రవేశించుటకు యోగ్యత కలుగదు. ఇట్టి శాస్త్ర, యుక్తి అనుభవములకు విరుద్ధములగు కారణములు కల్పించుకుని అస్పృశ్యాదులు సనాతనులను ద్వేషించుట భావ్యముకాదు. పాపము శాంతించుగాక!

తే॥ కసవుచే నీటిచే మోదకలనచేత । బ్రతుకు మృగమీన సజ్జన పరికరమునకు । శబర కైవర్తసూచక జనులు జగతి । కారణము లేని పగవారు గారెరలపు॥

హింసా జీవనవిధిలో సనాతనధర్మ నిర్ణయము అనుఅహింసా సిద్ధాంతము.

మనుష్యాదులచే చేయుబడు వివిధములైన హింసలు యెవియో పూర్ణముగా విమర్శించిన పిమ్మటనే అహింసా సిద్ధాంతము చెయ్యదగి యున్నది. హింసయనగా యెనుబదినాలుగులక్షల జీవరాసులలో యే ప్రాణికిగాని చేతిచేనైనను చేతిలోధరించబడు ఆయుధాదులచేనైనను భక్షణార్థము నోటిచేనైనను కాలిచేనైనను దేహముచేనైనను కఠినముగా స్పృశించుట మూలముగా మరణముగాని మరణతుల్యమైన బాధనుగాని కలుగచేయుటయైయున్నది. మనుష్య కృతములగు హింసలలో జ్ఞాన కృతములు అజ్ఞానకృతములు అని ద్వివిధములుగా నుండును. అజ్ఞానకృత ములు యేవనగా మనకు తెలియకుండనడచు నప్పుడును, పరుండు

సత్వాద్యను యితర యేవనులైనను చేయునప్పుడు ప్రమాదముచే క్రిమి కీటక జంతుమనుష్యాదులు మరణించుటయు లేక మరణతుల్యమైన బాధనొందుటయు నైయున్నది. యికను జ్ఞానకృతములైన హింసలు అనగా ప్రత్యక్షముగా తెలిసియుండియు చూచుచుండియు అనేక ప్రాణులకు మరణమును కలుగజేయుటయు లేక మరణముకంటె అధిక బాధను కలుగజేయుటయునైయున్నవి. వాటివాటి వివరమేమనగా మనుష్యనివాసార్థము గృహనిర్మాణాదులయందు భూమిని త్రవ్వుట చెట్లునరకుటలో గతించు అనేక క్రిమికీటకాదులున్నూ, దేహరక్షణార్థము శత్రు, సర్ప, వృశ్చిక, వ్యాఘ్ర, పిపీలిక, మశక, మత్కుణాదులనున్నూ మనుష్యోపయోగముగానున్న ద్రవ్య, ధాన్య, రక్షణాదుల కొరకు చోర క్రిమి, కీటక మూషకాదులనున్నూ, దేహపోషణార్థము ఓషధులు బీజములు, పశుపక్షిమృగాదులను భక్షణమూలముగానున్నూ వ్యవసాయ దార్లు మొదలయినవారలు భూమిని దున్నుటకు బండ్లులాగుటకు మొదలగువాటికి వృషభ అశ్వాదులనున్నూ ధాన్యాదులు మొదలగు ఆహారపదార్థములు పండించుటలో భూమిని నాగలితో దున్నునపుడు న్నూ, లేక త్రవ్వునపుడున్నూ, లెక్కపెట్టలేని పిపీలక, క్రిమికీటకాదులున్నూ, సస్యరక్షణలో అనేక క్రిమి, పక్షి, వానర, శూకరాదులున్నూ అట్లుపండించిన ధాన్యము ఆహారార్థ ముపయోగించుటలో ఖండినీ, పేషిణీ, చుల్లీ, ఉదకుంభీచ, మార్జని, అనగా వాటిని తరుగుట, నూరుట లేక దంచుట, ప్రొయ్యిమీద నుడుకబెట్టుట, నీళ్ళకడవలుంచుట, ఊడ్చి చల్లుట, అను ప్రతిదినమున్నూ సంభవించు పంచసూనదోష ములనున్నూ ఆహారము పచనానంతరము అన్నాదికముభుజించుటలోగా దాని రక్షణకొఱకు పిపీలిక, మార్జాల, శునక, వాయసాదులనున్నూ, ప్రాణాపాయకరములగు విషూచి, మశూచి మొదలగు రోగరూప బాధితక్రూరశక్తులకు ప్రాణాపాయము తప్పించుకొనుటలో ఛాగాది పశువులు మొదలగువాటిని జాతరలందును యితరకాలములయందును

బలిరూపముగానున్న రాజులు రాజ్యరక్షణార్థమున్నూ, శిష్టరక్షణ, దుష్టశిక్షణార్థము యుద్ధములయందు అనేక నరాశ్వగజాదులనున్నూ, గోబ్రాహ్మణ రక్షణార్థము వేటలయందు వ్యాఘ్రమృగాదులనున్నూ, ప్రపంచభోగములకంటె అనేకరెట్లు యోగ్యమయినట్టిన్ని ఈశ్వరాజ్ఞా రూపములగు శృతి స్మృత్యాదులలో విధించిన ప్రకారము దార బ్రాహ్మణ్య నివృత్తికొరకున్నూ ప్రజాకామ, భూతికామ, శతృజయాది సాధనార్థముగానున్న వివిధయజ్ఞాదులయందు పశ్వాదులను వధించుటయున్నూ, జ్ఞానకృతములైన అసంఖ్యాతములగు జీవహింసలుగానున్నవి. జీవహింసాపూర్వక కేవల మాంసాహారముచేతనే జీవించు వ్యాఘ్ర, జంబుక, సర్ప, వృశ్చిక, మాండూక, బకాదులు అనేకములు కలవు. పైన వివరించిన అనేకవిధములయిన హింసలలో జాతరలందుగాని, యజ్ఞములయందుగాని, జరుగు అత్యల్పహింసల నాక్షేపించుటయేగాని తక్కిన పైన వివరించిన హింసలలో వేటినిన్ని నాపుజేయుటకు యెట్టి దయామయునికైనను శక్తిచాలదు. యెందుచేతననగా శ్లో॥ ప్రాణస్యాన్నమిదం సర్వం ప్రజాపతిరకల్పయత్ । స్థావరం జంగమంచైవ సర్వం ప్రాణస్య భోజనం॥ అను మను వచనానుసారము ఈ ప్రపంచములో స్థావరజంగమాత్మకములైన పదార్థములన్నియు ప్రాణులకు ఆహారముగా బ్రహ్మచే కల్పింపబడియుండెను. మరియు ప్రాణి సమూహములో పుణ్యప్రాణులు క్రమముక్తినందునట్టి, అర్చిరాదిమార్గము అనిన్ని పాప తారతమ్యమునుబట్టి తిరిగి అనేకసార్లు జన్మించుచుండు అనేక జీవులకు ధూమాదిమార్గము అనిన్ని కలవు. అందులో ధూమాది మార్గము ద్వారా క్రమక్రమముగా జన్మలకువచ్చు జీవులు చంద్రలోకమునుంచి శృతి॥ ఛాందోగ్యోపనిషది పంచమ ప్రపాఠకం దశమఖండ పంచమ షష్ఠ అనువాకె॥ తస్మిన్యావత్సంపాతముషిత్వాఽథైతమేవాధ్వానం పునర్నివర్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమోభవతి ధూమోభూత్వా భ్రంభవతి॥౫॥ అభ్రంభూత్వా మేఘో

భవతి మేఘోభూత్వా ప్రవర్షంతి । త ఇహ వ్రీహి యవా ఓషధి వనస్పత
యస్తిల మాషా ఇతి జాయంతేఽ వై ఖలు దుర్నిష్ప్రపతరం యో యో
హ్యన్నమత్తి యో రేతస్సించతి తద్భూయ ఏవ భవతి॥౬॥ అను ప్రకా
రము ధూమాదిమార్గములో తిరిగి చంద్రలోకమునుంచి జన్మలకు
వచ్చు జీవులు ఆకాశములోను ఆకాశమునుంచి వాయువులోను
ఆ వాయువు ధూమముగాను, ఆ ధూమము మేఘముగాను, ఆ మేఘము
ఉన్నతప్రదేశములయందు వర్షించుటచేతను వర్షధారా రూపముగా పడి
జీవులు శేషకర్మను అనుభవించుట చిత్ర విచిత్ర పరిణామస్వరూపముగా
నుండును. గనుక యిందువలన వర్షధారా రూపముగా పడిన ఉదక
ములో మన దృష్టికి కనుపించని అనేక ప్రాణులు కలవని తెలుచున్నది.
అంతట ఆజీవులు వ్రీహి, యవాదిఓషధులు, వనస్పతులు, తిలలు మాష
ములు, మొదలైనవిగా పుట్టును. యింకను అధికపాపము జేశిన జీవులు
పర్వతములమీదను, చెరువులు, నదులు మొదలగు వాటిలో వర్షించిన్ని
సముద్రములో కలిసిన్ని అందులోని జలచరములచే త్రాగబడి సముద్ర
ములో అనామకములై తిరిగి మేఘములద్వారా వర్షింపబడుచు కొన్ని
శిలలు మొదలగు వాటియందు వర్షించి అనామకములై నశించుటయు
జరుగును. వ్రీహ్యాది జన్మలుగా వచ్చుటకూడ దుస్తరమై కొన్ని మృగ,
సర్ప, వృశ్చికాదులచే దాగ్రివబడి అపాత్రజన్మలు కలుగును. వీర్యహీను
లయిన బాలులు నపుంసకులు మొదలగు వారిచే దాగ్రివబడి నశించు
టయు తుదకు రేతోరూపముగా పరిణమించి మనుష్యదేహము
నొందుట దుర్లభముగానుండును. కాకతాళీయన్యాయముగా వ్రీహి
యవాది భక్షణరూపముగా మనుష్యరేతస్సుగా పరిణమించి యెట్టి
వారల రేతస్సు స్త్రీలయందు ప్రవేశపెట్టబడునో అట్టి యాకృతిగలవార
లుగా జన్మించుదురు. జీవశక్తిగల అట్టి పురుష రేతస్సువలన గర్భోత్పత్తి
కలిగి కర్మానుసారముగా ఆయాయోనులయందు జన్మలు కలుగు
చున్నవి. వ్యవసాయదారుడు తరిమెరిగి బీజమునాటునట్లు అట్టి రేత

స్సును గర్భోత్పత్తికాదగిన ఋతుకాలములు కనిపెట్టి స్వభార్యయందు
సత్సంతానార్థము వుంచుటకు ప్రయత్నించవలెను. అట్లు స్వభార్య
యైనను స్వేచ్ఛగా యితర కాలములయందు సంగమించినయెడల
జీవోత్పత్తి కాదగిన రేతస్సు అను బీజమును వ్యర్థముచేయుటచే
భ్రూణహత్యా దోషము సంభవించును. అనగా మనుష్యోత్పత్తి
కాదగిన రేతస్సును వ్యర్థపరచుటయను హింసాదోషమునకు పాత్రు
డగును. ఒకవేళ అట్టి రేతస్సును కామాధిక్యముచే యితర నీచ
యోనులందుగాని వియోనులయందుగాని వుంచుట చేతకూడ ఆజీవులను
హింసించుటయే యగును. శ్లో॥ అశ్వమేధికే॥ శూద్రాయోనౌపతద్బీజం
హా హా శబ్దం ద్విజన్మనః। కృత్వాపురీషగర్తే షుపతితోస్మితిదుఃఖితః
మామధఃప్పాత యన్నేష పాపాత్మా కామమోహితః అధోగతిం వ్రజే
త్క్షిప్రమితిశప్త్వాపతేద్ధ్రువం॥ శూద్రాది నీచయోనులయందు రేతోబీజ
రూపజీవుడు పడుటలో హాహాయని దుఃఖించుచు కామమోహముచే
పాపాత్ముడు నన్ను అమేధ్యపుగోతిలోపల వేయుచున్నాడు గనుక వీడు
వెంటనే అధోగతినొందునుగాకయని శపించును. పైనవుదహరించిన సంగ
తులవల్ల జీవుల కుండుజన్మపరంపరలు సూచనగా తెలుసుకొనుటచే జీవ
హింసచేయకుండ జీవించుట సాధ్యముకాదనియు అన్నిప్రాణులు జీవిని
జీవి భక్షించుట మూలముగా జీవించక విధిలేదనియు కనిపించుచున్నది.
ప్రపంచభోగములున్నూ, స్వర్గాధిభోగములున్నూ వర్జించి కేవల జన్మ
రాహిత్యమును ప్రయత్నించు బ్రహ్మజ్ఞానులైన సన్యాసులునగా యేవిధ
మైన జీవహింసచెయ్యకుండా ఈ ప్రపంచములో నటించలేరనిస్పష్టపడు
చున్నది. ఇట్టిస్థితిలో ఇహపరభోగములను కోరు సంసారులు యేవిధము
యిన జీవహింసచెయ్యకుండ జీవించలేరని వేరే చెప్పవలయునా? గను
కనే అన్నిప్రాణులు హింసాజీవన విధిలోనివే యనవలసి వచ్చినది. ఈశ్వ
రాజ్ఞారూపములగు శృతిస్మృత్యాదులలో విధించిన ప్రకారము యజ్ఞ
ముల యందును జేయు ఛాగాదిపశువధయున్ను వేదాధికారములేని

శూద్రాదులకు ఆగమశాస్త్రాదులలో విధించినప్రకారము కాళీ మొదలగు క్రూరశక్తులను ఆరాధించుటలోనున్నూ జాతరలందు గ్రామ దేవతలు మొదలగు క్షుద్ర దేవతలను ఆరాధించుటలోను వారి వారికి ప్రీతికరము లగు మధుమాంసాదులను నివేదించుటయు పశ్వాదులను బలిరూపముగా వధించుటయు సనాతనాచారముగా నున్నది. యిదివరకు వివరించి యున్న స్వేచ్ఛాహింసాపూర్వక జీవనవిధిలో యజ్ఞముల యందును జాతరలు మొదలగువాటియందును జేయబడు పశ్వాదిహింసలు యెట్టి స్వల్ప దోషముగ నుండునో యితరులందరు స్వేచ్ఛగా జేయు అసంఖ్యాతములగు హింసలలో ఈశ్వరాజ్ఞానుసారము జేయు హింస యెట్లు దోషముగలదగునో గ్రహించలేని వారు పామరులను భ్రమింప జేయుటకు పైకి పరమదయాళువులవలె నటించుచు సనాతనులను పరిహ సించుట యెట్లున్నదనగా క॥ కరచరణంబులుగలిగియు । కరచరణ విహీనుచేత కడుదుర్బలుడై జల । చరము పట్టుబడెనని । శిరహీనుడు నవ్వెనట్టి చిత్రముగలదే॥ కాలుచేతులు కలిగియుండిన్ని నీటిలో సంచ రించగల కప్ప, చేతులు కాళ్లు లేనట్టి సర్పముచే మిక్కిలి దుర్బలుడై పట్టుబడుటను జూచి తలకాయలేని మొండెమువలె నుండునట్టి ఎండ్రకాయ పరిహాస పూర్వకముగా నవ్వినదట. అట్టి చిత్రము గలదా యనినట్లుండును. యేమనగా అట్లు ఎండ్రకాయ నవ్వినమాత్రముచే తనకు సహజమైన ఆహారముగా నేర్పడిన కప్పను పాము మింగుట మానునా? పూర్వజన్మ పాపకర్మానుగుణ్యముగా అట్టి హీనజన్మకలిగిన కప్పను ఆసర్పమునుంచి తప్పించుకొనునట్టి అధికశక్తి కలుగునా? అట్లు జీవహింసచేయు సర్పమును నివారించి కప్పను రక్షించునంతటి శక్తి ఈ తలలేని మొండెమువలెనుండు ఎండ్రకాయకు సమర్థత కలుగునా? లేక అట్లు పరిహసించు ఎండ్రకాయ సైతము తనకంటె తక్కువదర్జాలో నుండు క్రిమికీటకాదులను హింసించి భక్షించకుండ జీవించగల్గునా? తుదకు తానుకూడ నక్కలు మొదలగువాటిచే చంపి భక్షింపబడకుండ

తప్పించుకొనగల్గునా ఈ మొదలగు సంగతులు విమర్శనాశక్తిలేని తలలేని ఎఱ్ఱకాయల సమూహామువలెనే సనాతనులను పరిహసించు వారును అగుదురు. యజ్ఞములనగా ఇహసంబంధమైన దోషములకు పాపపరిహారక ప్రాయశ్చిత్తపూర్వకముగా పవిత్రులగుటకుగాను కేవల ఉత్తమఫలమగు స్వర్గాదులనిమిత్తం ఈశ్వరాంశాసంభూతులగు ఇంద్రాది దేవతా తృప్తికొరకు చేయునవిగా యున్నవి. సంధ్యావందనాది నిత్య కర్మలు సప్తపాకయజ్ఞములు, సప్తహవిర్యజ్ఞములు, సప్తసోమయజ్ఞ ములు, దేవయజ్ఞ, పితృయజ్ఞ, భూతయజ్ఞ, మనుష్యయజ్ఞ, బ్రహ్మ యజ్ఞములున్నూ యింకను అనేకములైన యజ్ఞభేదములు కలవు. వాటిలో కొన్నిగా యున్న భ. గీ. 4 అ. 28 శ్లో॥ ద్రవ్యయజ్ఞా, స్తపో యజ్ఞా, యోగయజ్ఞా స్తథాపరే, స్వాధ్యాయజ్ఞా నయజ్ఞాంశ్చ యతయ స్సంశితవ్రతాః॥ అను ప్రకారము ద్రవ్యయజ్ఞము అనగా శ్రీకాశ్యాది పుణ్యక్షేత్రములలో ధనధాన్యాది ద్రవ్యములను యోగ్యులయిన వారికి దానము చేయుట, తపోయజ్ఞమనగా మనోవాక్కాయములచే త్రివిధ తపస్సులు చేయుట, యోగయజ్ఞమనగా భగవదారాధనకు యోగ్యమగునటుల చిత్తమును నిరోధించు సాధనములగు ప్రాణా యామాదులనభ్యసించుట, స్వాధ్యాయజ్ఞాన యజ్ఞమనగా అర్థజ్ఞానవిచా రణపూర్వకమయిన వేదాధ్యయనము చేయుట, సంశితవ్రతాఃకఠినములైన వ్రతములు అనగా యజ్ఞములందు పశుహింసాపూర్వక నియతవ్రతులగు వారియుకూడ నొకటిగానున్నది. అందువలన క్రమక్రమముగా ఉత్తమ జన్మలుపొంది తుదకు మోక్షమునందునవిగాయున్నవి. ఇట్టి అనేక విధ ములైన యజ్ఞములలో కర్తయొక్క సాత్విక రాజస తామసశక్తి తార తమ్యము ననుసరించి వారి వారికి సాధ్యములగునవి చేయబడుచున్నవి. వాటిలో ద్రవ్యసాధ్యమగు అన్నాది భక్షణ పదార్థములచే తృప్తి పొందించునట్టి ధాన్య ఫలాదులనుసంపాదించుటకుగాను తానుగాని అట్టి ధాన్యములు పండించువారుగాని యినపకర్రుతో వేయబడిన నాగలితో

భూమిని దున్నుట, లేక త్రవ్వుట మొదలగు పనులు చేయుటలో యఱ్ఱలు, పిపీలిక, క్రిమి, కీటకాదులు అనేకములు భిన్న దేహులై మరణించుటయు మరణముకంటె మిక్కిలి కష్టమగు వికలాంగములతో బాధనొందుటయు, ప్రత్యక్షముగా అందరికి కనుపించును. శ్లో. సంవత్సరేణ యత్ పాపం మత్స్యఘాతీ సమాప్నుయాత్। అయో ముఖేన కాష్ఠేన తదేకా హ్యేనలాంగలే॥ ఒక సంవత్సరకాలము చేపలు పట్టువానికెంత పాపమో అంతటి పాపము యినప కర్రతో వేసినకొయ్య నాగలితో భూమిని దున్ను వానికి వక్కరోజు దున్నుటతోనే సంభవించును అని యున్నది. అట్లు భూమిని దున్నుటకు యేర్పడిన మనుష్యులకు యెద్దు మొదలైన వాటికి మొక్కలు నాటుకూలీలకున్నూ అర్ధాహారముగా నయినా సరిపోనికూలి వగైరాలు యిచ్చుచూ వారి వారి జీవితకాలములోనే విరామము అనగా యెట్టికో యొసగక ఆమరణాంత ఘోర కష్టమువారిచే చేయించుచు మధ్య మధ్య వాటిని క్రూరదండన సగా చేయుచుండుట మరణముకంటె అధిక హింసగా నున్నది. మరియు బండ్లు లాగుటలోను యెద్దు గుఱ్ఱములు, మొదలగు వాటిని శ్వేచ్ఛగా హింసించుచు వాటికి కాలునొప్పో, కడుపునొప్పో, ఆహారాదికము కావలెనో కనిపెట్టక ఆమరణాంతము హింసించుట ఘోర పాపమె యగును. అట్లు వాటిని హింసా పూర్వకముగా కష్టపెట్టుటకంటె అట్టి కష్టములో పాల్గొనుటకు దయామయ నటకులైన తానుగాని తనకొడుకులుగాని తమ తండ్రులుగాని లేక దయామయులైన యితరులుగాని యెవరున్ను అంగీకరించరు. గాని వాగూశిసముగా అహింసా ప్రచారము మాత్రము చేయుదురు. మరియు ధాన్యాదులు పండి యింటికి వచ్చులోగా చోర పశు పక్షిమృగాదులను, హింసా పూర్వకముగా నష్టపడకుండ జాగ్రత్త పెట్టని యెడల ఆధాన్యాలు యింటికిరాకనే నష్టమగును. ధాన్యాదులు యింటికి తెచ్చినపిమ్మటకూడ యెలుకలు మొదలగు వాటివలన నష్టము కాకుండ హింసా పూర్వకముగా జాగ్రత

పెట్టవలసియే యుండును. అట్టి ధాన్యాదులను ఆహారముగా నుపయో గించుటలో బాగుచేయుట, దంచుట, పిండివిసరుటలోను యెంతజాగ్రత్తగా కాపాడుచున్నను అనేక సూక్ష్మజంతువులగు పిపీలికాదులు మరణించు చునే యుండును. వాటిని అన్నాది రూపముగనో భక్ష్యరూపముగనో సిద్ధముచేసిన పిమ్మట యోగ్యులయిన వారికి భుజింపజేయులోగా శునక మార్జాల వాయసాదులను హింసాపూర్వకముగా రక్షణ చెయ్యక తప్పదు. "నాన్నోదక సమందానం" అను ప్రకారము అట్లు అనేక హింసాపూర్వకముగా సిద్ధపర్చిన అన్నాదికమును కాశ్యాది పుణ్యక్షేత్రములయందు సత్పాత్రయందు వినియోగించుట మొదలగు ద్రవ్యయజ్ఞము అయియున్నది. పైన వివరించిన హింసలు తాను స్వయ ముగా చెయ్యకపోయినను అట్టి హింసాపూర్వకముగా సంపాదించిన ద్రవ్యమును తానుఉపయోగించుటచే హింసాదోషము లేదనుకొనుట పొరపాటు అయినను అట్టిహింసాకృత్యములలో యేకొంతభాగము అయి నను తానున్న స్వయముగా అచరించకనున్నా విధితప్పదు. తపోయజ్ఞ యోగయజ్ఞాదులవలన యెట్టిహింసలు లేకపోవచ్చుననుకొనుట పొర పాటు. యేమనగా తానుతపస్సు లేక జపము చేయుటకునిర్ణయించుకొను ప్రదేశమునందు అందుకు విఘ్నకారకములగు పిపీలిక మశక మత్కుణా దులున్నా, సర్పవృశ్చిక వ్యాఘ్రమృష్టాదిబాధ నివారణరూపమగు హింసగాని వధగాని చెయ్యకుండా నిర్మల స్థలము లభించుట దుర్లభము. అట్టి హింసలు తాను స్వయముగా కొన్ని చెయ్యకపోయినను రాజులు మొదలగు వారిచే తాను చేయించినను హింసాకృత్యము కాకపోదు విశ్వామిత్రుడు తనయజ్ఞరక్షణార్థము శ్రీరామునిచే తాటకి మొదలగు వారిని సంహరింపజేయుటచే హింసాకృత్యము కాకపోవునా? మరియు తపస్సుచేయుటలో శీతాతపవర్షాదులునుంచి రక్షణ నిమిత్తము శాలలేక గృహమునిర్మించుటకు భూమిని త్రవ్వుటలోను చెట్లునరకుటలోను లెక్కపెట్టసాధ్యముకాని పిపీలిక క్రిమికీటకాదులు మరణించును. ఋష్యా

దులచే భక్షించబడు ధాన్యఫలశాకాదులున్ను ప్రాణిసమూహములోనివి అయివున్నవి. యిట్లు బీజరూపప్రాణులను నిత్యము యెన్నిటిని భక్షణ మూలముగా హింసకులుగ జేయుచున్నారో లెఖ్ఖించసాధ్యముకాదు. ప్రత్యక్షముగా ప్రాణముగలపశుపక్ష్యాదులను యేదోవకానొకటి తప్ప తక్కినఅన్నిటిని శ్వేచ్ఛగా భక్షించ సిద్ధపడునట్టి వివిధ తెగల మనుష్యులు కలరు. పూర్వము రాక్షసులు మనుష్యమాంస భక్షకులుగానున్నారు. ప్రస్తుతము కూడాకొన్నిద్వీపములలో మనుష్యమాంస భక్షకులు కలరనివినికిడికలదు. పైన వివరించిన హింసలుగాక యింకను సూక్ష్మ విచారణచే గాని బోధపడని అనేక హింసలుచేసి యేప్రాణిసమూహము జీవించుచున్నది.

జపసిద్ధి కొరకు ఉపయోగించు కృష్ణాజిన వ్యాఘ్రాజినాదులుజీవ హింసా పూర్వకముగా లభించునవై యున్నవి. 'యతయ స్సంసితవ్రతాః' అను ప్రకారం పశుహింసా పూర్వకమైన యజ్ఞాదులు చేయుటచేతను ఇంద్రాదిదేవతా తృప్తికలిగి స్వర్గాదులు లభించును. శ్రు॥ తరతితరతి బ్రహ్మహత్యాం యోశ్వమేధేన యజతే॥ మన మునివసించు భరతఖండము లేక భారతదేశము అను నామము వహించుటకు ఆధారభూతుడైన శ్రీ భరత మహారాజు బ్రాహ్మణ పురస్సరముగా 133 అశ్వమేధ యాగములు చేసియున్నట్లు భాగవతములో ప్రమాణముకలదు. యికను పూర్వము అనేకులు పశుహింసా పూర్వక యాగములను చేసి యున్నారు. గ్రంథవిస్తర భీతిచే విరమించడమైనది. జీవులందరికి పూర్వ జన్మకర్మానుభవ రూపతారతమ్యమయిన జన్మలు కలుగుచున్నవి. యెట్లనగా "స్వామిద్రోహరతాయేచ కుక్కుటజన్మ మాప్నుయుః" స్వామిద్రోహము చేశినవారు కోడిజన్మ నొందుదురు. "అదత్వాచాగ్ని విప్రేభ్యః ప్రాశనాద్భుజగో భవేత్" బ్రాహ్మణులకును అగ్నిహోత్రము నికి యివ్వకుండ భుజించినవాడు సర్పమై పుట్టును. "విశ్వాసహర్తాతు నరోమీనో జాయేతదుర్మతిః" నమ్మినవానిని చెరుచువాడు చేపజన్మము

నొందును. "ఖరోవై బహు యాచిత్వా కాకో మంత్రిత భోజనాత్" అపరిమితయాచనచే జీవించువాడు గాడిదయై పుట్టును. ఆమంత్రణ లేనిదే వెళ్లి భుజించువాడు కాకియైపుట్టును. యిట్టివారివారి దుష్కర్మల చెపశ్వాది జన్మలు కలుగును. అట్టి దుష్కర్మయొక్క న్యూనాధిక మును బట్టి జీవులు వకసారిగాని అనేకసార్లుగాని ఆయా పశ్వాదులలో గాని అంతకంటె హీనజన్మలుగాని యెత్తుచు యితరులచే హింసించబడి దుర్మరణము నందుచుండును. విశేషము తెలియగోరువారు కర్మ విపాకము చూడనగును.

నందీపురాణే॥ నరకేషు క్రమేణైన బ్రహ్మహా పాచ్య తేనరః;కల్పం కల్పంత తశ్చాంతె స్థావరశ్చ ప్రజాయతే। తృణగుల్మలతావల్లీ వీరుద్రుమ విభేదతః। లతాభే దాశ్చనిస్సంఖ్యావల్లీ భేదా స్త థైవచ, వీరుర్భేదా దసంఖ్యాతా అసంఖ్యా ద్రుమజాతయః తేషాంచ దేశభేదేన పునః కష్ట త్వముచ్యతే। తతః కేనాపి కాలేన నానాస్థావరయోనితః। కర్మభుక్త్వా క్రమేణైవ భవంతి చసరీసృపాః, వృక్షవల్క లభేదే న వాప్యథ, సరీసృపాది భేదేనతత్ర భుక్త్వాతు పాతకం। మృగేషు జాయతో మర్త్యో భేదైరగణిత స్తతః తత్రాపిభుక్త్వా స్వకర్మ జాయతే పశుయోనిషు తత్రాపి భౌతికం భోగం భుక్త్వాంతె గోత్వ చాప్యతు ముచ్యతే పశు జన్మాతస్తతో జాయేతమానుషే, తత్రాపి నియమోనాస్తి శ్వప చాదిషు జాయతే విపాంతేషు మనుష్యేషు జాయతే పాతకీనరః॥

అనగా బ్రహ్మహత్య మొదలగు ఘోరపాపములు జేయువారలు వక కల్పపర్యంతం స్థావరములుగా జన్మించుటలో గడ్డిపోచలు పొదలు తీగెలు వృక్షములు వాటివాటిలోనుండు అనేక భేదజాతులలో జన్మించుచు ఆపిమ్మట సరీసృపాదులుగా వాటిలో అనేకభేదజాతుల జన్మించుచు ఆపిమ్మట మృగజాతులలో జన్మించుచు ఆపిమ్మట పశుజాతులలో జన్మించుచు తుదకు గోవులలో జన్మించును. గోవు జన్మలో అనుభవించిన పిమ్మట మనుష్యులలో జన్మించును,

ఆమనుష్యులలో చండాలాదులలోగాని శూద్రాదులలోగాని మనుష్యులలో ఆఖరు దిన్ని ఉత్తమమున్నా అగు బ్రాహ్మణ జన్మగాని యిట్లు క్రమక్రమముగా పొందును. బ్రాహ్మణుడుగానుండి సత్కర్మలు చేసినయెడల దేవాది జన్మలు కలుగును. దుష్కర్మలు చేసిన యెడల తిర్గి పశ్వాదులలో జన్మలు కలుగుచుండును. యిట్లు జన్మించు నట్టి గడ్డిపోచ మొదలగు పశుమనుష్యాదులలో తిరిగి ఉత్తమ మధ్యమాధమ భేదములనుబట్టి జన్మించుచు ప్రపంచములో ప్రాణులకు అనేక సార్లు ఆహారరూపముగనో, ఆచ్ఛాదన రూపముగనో, శరీర స్పర్శారూపముగనో, గృహనిర్మాణ రూపముగనో వాహనరూపముగనో, భృత్యరూపముగనో, భార్యాభర్త సుతాదిరూపముననో దాన రూపముగనో, ప్రాణరక్షణ రూపముననో, దేవతాప్రీతి కరములగు పనుల రూపముననో బలిరూపముననో అగ్నియందు హోమము రూపముననో యజ్ఞాదులయందు, జాతరలందు వధారూపముననో, అనేక సార్లు శత్రుత్వముగనో, మిత్రత్వముగనో, అన్యోన్య ఉపకారాపకారముల మూలముగా మరణముగాని మరణతుల్యమైన హింసగాని పొందుచుందురు. అట్లు హింసనొందుటలో శ్రేష్ఠముగు దేవబ్రాహ్మణ గవాదులకు సహాయపడి మరణించునట్టి జీవులు ఉత్తమలోకములు పొందితిరిగి ఉత్తమ జన్మలు కలుగును. కిరాతకులు గోబ్రాహ్మణ హంతకులు మొదలగు వారికి సహాయపడుట మూలముగా మరణించు జీవులందరు నరకాదులను పొంది యింకను నీచ జన్మముల నెత్తుచుందురు. గనుక యజ్ఞములు మొదలయిన దేవతా ప్రీతికొరకు వధించబడు పశ్వాదులు సద్గతినందుటయేగాక యజమానునికి కూడ స్వర్గాదులు కలుగజేయునవిగాయున్నవి. శ్లో॥ బ్రాహ్మణార్థే గవార్థేవాయస్తు ప్రాణాన్ పరిత్యజేత్ । ముచ్యతే బ్రహ్మహత్య యాగోప్తాగో ర్బ్రాహ్మణస్యచ॥ అను పారాశర వచనాను సారము బ్రాహ్మణుల కొరకుగాని గోవులకొరకుగాని యెవరిప్రాణములు విడువబడునో అట్టివారికి బ్రహ్మహత్యాది

పాపములు తొలగి సద్గతికలుగును. అనునప్పుడు ఇంద్రాదిదేవతా తృప్తి కొరకు యజ్ఞములయందు వధింపబడుట అధికపుణ్యమే యగును. "అర్థిసమర్థో విద్వాన్ జాతపుత్రః కృష్ణకేశోనిరోగ" అను ప్రకారము అట్టి లక్షణములుగల యొకానొక యోగ్యుడైన బ్రాహ్మణుడే చేయునుగాని ప్రతివాడును చేయుటలేదు. అట్లు చేయుటలో ఈశ్వరాజ్ఞలగు వేదవిధిననుసరించి దేవతా ప్రీతికొరకు యజ్ఞములయందు పశువధ జర్గించుగాని స్వేచ్ఛగా తాను మాంసాహారము చేయుటకుగాదు ఈశ్వరుడు తానుజేసిన సృష్టిలో పృథివి జలాగ్ని వాయు ప్రళయాదులచే గతించు జీవులయొక్క హత్యాదోషము ఈశ్వరునికిగాని ఇతరులకుగాని యెట్లు చెందదో అట్లు ఈశ్వరాజ్ఞలగు శృతిస్మృత్యాదులలో విధించబడిన పశువధవలన దోషముజెందదు. శ్లో॥ యజ్ఞార్థం పశవస్సృష్టాః స్వయమేవస్వయం భువా। యజ్ఞోస్య భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోవధః॥ ఓషధ్యః పశవో వృక్షాస్తిర్యంచ పక్షిణస్తథా। యజ్ఞార్థం నిధనప్రాప్తాః ప్రాప్నువంత్యుత్సృతీః పునః॥ అను మనువచనానుసారము స్వయంభువైన బ్రహ్మచే యజ్ఞార్థముగా పశువులు సృష్టించబడి యుండుటచేత యజ్ఞములయందు చేయు వధ వధగా నెంచబడదు. ఓషధులున్నూ, పశువులు, వృక్షములు, తిర్యక్కులు, పక్షులు, మొదలగు వాట్కి యజ్ఞార్థముగా మరణము సంభవించె నేని తిర్గి ఉత్తమ జన్మలు కల్గును. వారు వారు జేయు నేరముల తారతమ్యమును బట్టి ప్రభువుచేతను శిక్షానుభవముగా విధించబడు దెబ్బలుకొట్టుట, ఖైదు విధించుట, లేక మరణదండన విధించుట యనునవి వారు వారు అనుభవించకుండ తప్పించుటకు సిద్ధపడు వారియందు ప్రభువుకు యెట్లు ఆగ్రహము కలుగునో అట్లే పూర్వజన్మయందు పశువుగా బుట్ట తగిన దుష్కర్మ చేసియుండినట్టి శిక్షా రూపముగా మరణము నొందుటను అనుభవించకుండ తప్పించ సిద్ధపడువారి యందు ఈశ్వరాగ్రహము కలుగును. "ఆత్మవత్సర్వ భూతాని" అనువారు సైతము అజ్ఞానముచే

హింసించబడు జీవులుగాక బుద్ధి పూర్వకముగా యెరిగి యుండియు నొక్క దినమయినను జీవహింస చెయ్యకుండ నుండగలమని ప్రతిజ్ఞ చేయువారు లేరు. అట్లు సర్వ భూతములు సమానమేనని న్యాయము తప్పక సంచరించువారు యెట్టిప్రాణిని హింసించకుండ నుండుట దుస్తర మగుటచే అట్టి వాటిదోషముకు మరణాంత ప్రాయశ్చిత్తము చేశికొని నను సరి తూగకుండును. అనిత్యమగు ఈ దేహ రక్షణలో ఇహ సుఖ ముల కొంకు నిత్యమున్నూ లెఖ్ఖ లేని జీవహింసా పూర్వకముగా జీవించుచుండుటకంటె అనేకరెట్లు యోగ్యతవహించినట్టి స్వర్గాదిభోగ ముల కొరకుగాని ఇంద్రాది దేవతా తృప్తి కొరకుగాని పరసుఖము కోరి యజ్ఞాదులయందుచేయు అతిస్వల్ప పశువధాదులు దోషములనుట భావ్యముగాదు. అపాత్రులదేహ పోషణకొరకు పయోగించుటలో దుర్మ రణము నొందుటకంటెఇంద్రాది దేవతాతృప్తికొరకుపయోగించు ప్రాణు లున్నూ అట్లుపయోగింపజేయు కర్తలున్నూ ఉత్తములోకములను పొందుదురు.

'ఆత్మవత్ సర్వభూతాని' అనుప్రకారము అన్నిభూతములనుతన వలెనే చూడవలెనని బోధించుటయేగాని అట్లుజరిగించువారు లేరు. యేమనగా పశ్వాదులకు గడ్డిచిట్టు మొదలగు ఆహారమిచ్చి తాము వాటివల్లనే సంభవించిన పాలు, పెరుగు, నెయ్యి మొదలగు మంచి అహారము అనుభవింతురు. యెడ్లు గుఱ్రములు మొదలగు వాటిని బండ్లు లాగుటకు నాగలి దున్నుటకు నుపయోగించి వాటిచే విరామములేని కష్టమును చేయించుచుందురు. తుదకు తమనొకఖ్ఖసగా అధిక కష్టము చేయించుచు తమతోసమానముగా ఆహారమియ్యక తాము మృష్టాన్నమును భుజించుచుందురు. అప్పుడు పైదాని అర్థమును మరతు రేమో వూహించజాలము. యికను వేటివేటియందు సమబుద్ధిగాజూతురో తెలియదు. ఒకవేళ నిజముగా వారుతలంచే సమత్వము జ్ఞాపకముకు తెచ్చుకున్నయడల వాటిచే చేయించబడు కష్టమునుజూచి నిర్దయుడు

గా నుండక వాటిచే దున్నబడునాగలినిగాని బండినిగాని తాముగాని తమబంధువులుగాని బుజముమీద వేసుకొని ఆపనిని నిర్వర్తించుట యున్నా నవుకర్ను కష్టపెట్టక ఆపనిని తామె నిర్వర్తించుచున్నయడల పైదాని అర్థమును సార్థకపరచినవారగుదురు. అట్లు జరిగించనియడల సర్వభూతములయందును పరమదయాళుడనని చెప్పుకొనగలుగునా? పైప్రకారము జర్గించ సాధ్యము కాదనిన్ని వాటివాటి పూర్వజన్మ కర్మానుసారము అట్టికష్టపుజన్మలు కలుగుననిన్ని అట్టికష్టమును అనుభవించక తీరదనిన్ని గ్రహించగలవారలు 'ఆత్మవత్ సర్వభూతాని' అను దానికి భ. గీ. 6 అ 29 శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని । ఈక్ష తేయోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ అను ప్రకారము ఎల్లభూతములయందు సమదర్శియగు యోగముతో గూడిన మనోయుక్తుడగువాడు సమస్తభూతములయందు తననున్నా తనయందు సమస్తభూతములనున్నా జూచుచుండును అనగా సర్వభూతములను బ్రహ్మభావముతో జూడవలెనని అర్థము జేసికొందురు. భగవద్గీతలలో శ్రీకృష్ణుండు అనేక సందర్భములలో అర్జునునకు అహింసను బోధించి యుండెను.

స్వజనమైన ముఖ్యబంధువులను గురువు మొదలయినవారిని సంహరించిన యడల దోషము సంభవించునని అర్జునుడు విచారించగా భ. గీ. 2 అ. 31 శ్లో॥ స్వధర్మమపిచావేక్ష్య నవికం పితుమర్హసి । ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥ అనగా నీస్వధర్మము అయిన యుద్ధమును గురించి విచారించుట భావ్యముగాదనిన్ని క్షత్రియునికి ధర్మయుద్ధముకంటె శ్రేయోదాయకమైన వేరొకకర్మ లేదనిన్ని బోధించెను. మరియు భ. గీ. 3 అ. 9 శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః । తదర్థం కర్మ కౌన్తేయ ముక్త సంగ స్సమాచర॥ అనగా ఈశ్వరార్పణముగా యజ్ఞాదుల నిమిత్తము చేయునట్టి కర్మబంధకము కాదనిన్ని అట్టిదానిని సంగరహితుడవై

చెయ్యమనిన్ని బోధించెను. అట్లు బోధించుటే మాత్రమేగాక తాను స్వయముగా సారథ్యము వహించి అర్జునుని చే యుద్ధమునందు అనేక నరాశ్వగజాదులను చంపించియుండెను. యిందువల్ల ధర్మయుద్ధాదుల యందును యజ్ఞాదులయందును చెయ్యబడు హింసలు హింసలుగా పరిగణించవీలులేదని భగవద్గీతలవలన కూడ తెలియుచున్నది. పారా శరస్మృతి శ్లో॥ యంయజ్ఞసంఘై స్తపసాచవిప్రా స్వర్గైషిణోవాత్రయథైవ యాంతి క్షణేనయాంత్యే వహితత్రవీరాః ప్రాణాంసుయుద్ధేషు పరిత్య జంతః॥ అనగా యజ్ఞాదులవలనను తపస్సువలనను బ్రాహ్మణులు యెట్లు స్వర్గాదుల నొందుదురో అట్లే యుద్ధములయందు రాజులును, రాజులకు సహాయపడి వెనుదియ్యక మరణించిన శూరులున్నూ వక్కక్షణము లోనే స్వర్గాదులను పొందెదరు అని యున్నది. మరియు భ. గీ. 18అ. 48 శ్లో॥ సహజం కర్మకౌన్తేయ సదోషమపినత్యజేత్ । సర్వారంభా హిదోషేణ ధూమేనాగ్ని రివావృతాః॥ అనగా యెవరు యేపని చేయు టకు ప్రారంభించినను పొగచేత కప్పబడి కనుపించకనుండు అగ్ని వలెనే దోషములతో కూడియున్నవి. గనుక పూర్వజన్మకర్మాను గుణ మయిన ఈ సృష్టిలో యెవరికి యేకర్మ సహజముగా నిర్ణయించ బడియున్నదో అట్టి కర్మదోషయుక్తమైనప్పటికిన్ని విడువకూడదు అని యున్నది గనుక జ్ఞానకృతములైన జీవహింసలలో కూడ సాధ్య మయినంతవరకు తప్పించుకొనుచున్నా విధిలేనప్పుడు జీవహింసలు చేసి జీవించుచు వాటికి సగా దైవప్రార్థన పూర్వకముగా నిద్దుర లేచినది మొదలు తిరిగి రాత్రి నిద్రించువరకు వివిధప్రాయశ్చిత్తాదులు చేసు కొనుచున్నూ, అజ్ఞానకృతములైన వాటికిని ఆయా సందర్భానుసారము ప్రాయశ్చిత్తాదులు చేసుకొనుచున్నూ, జీవయాత్ర గడపుకొనుచుం డుట సనాతన ధర్మ నిర్ణయమై యున్నది. వాటిలో అజ్ఞానకృతములైన హింసలకు నైతను దోషము లేదన గూడదు. యేమనగా నిప్పును చూడకుండ ద్రొక్కిన బాధ లేకుండునా? అట్టి వాటికి కొంచెము క్షమాపణార్థముగ

నుండును. ఆ దోషమును తాను చేయు యితర పుణ్యకార్యములవలన పోగొట్టుకొన వలయును. ప్రథమములో వ్రాయబడిన జ్ఞానకృతములైన హింసలన్నిటికి యథామతిగా ప్రాయశ్చిత్తాదులు తెలుపబడుచున్నవి. అట్టిప్రాయశ్చిత్తాదులు తెలుపుటకు ముందు ప్రాయశ్చిత్తాదుల వలన పాపపరిహారమగునా యనునది విచారించవలసియున్నది. హింసాదోషములు మొదలయిన వాటివలన పాపముకలదని యెట్టి ధర్మశాస్త్రములను నమ్మెదరో అట్లే పాపపరిహార ప్రాయశ్చిత్తములు కూడ కలవని వివరించబడిన ధర్మశాస్త్రములను నమ్మక విధిలేదు. విష్ణుధర్మోత్తరే శ్లో॥ ప్రాయశ్చిత్తై శ్శమంయాతికృతం పాపం నసంశయః। ప్రాయశ్చిత్త విహీనాయే రాజభిశ్చా ప్యతాడితాః। నరకంప్రతిపద్యంతి తిర్యగ్యోనింతథైవచ। మానుష్యమపిచాసాధ్యం భవంతీహతదంకితాః। ప్రాయశ్చిత్తమతం కార్యం కల్మష శ్చాపచుత్తయ॥ అనగా చెయ్యబడిన పాపము ప్రాయశ్చిత్తము వలన శమించుటకు సందేహములేదు. ఒకవేళ అట్టి పాపముకు ప్రాయశ్చిత్తము చేసికొనక గాని రాజుచేత దండనమైనా పొందకయుండి గాని యున్నవాడు నరకానుభవము చేసిన పిమ్మట కొన్నాళ్ళకు తిర్యగ్యోనులయందు జన్మించుచు మరికొన్నాళ్ళకు దుర్లభమైన మనుష్యజన్మ పొందియున్నప్పటికి తాను మొట్టమొదట యెట్టి హింసాకృత్యము చేసియుండెనో ఆయాజన్మలలో అట్టి గుర్తుగలవాడుగా భూమియందు జన్మించుచుండును. గనుక పాపపరిహారము కొరకు తప్పక ప్రాయశ్చిత్తము చేసుకొను చుండవలెను.

ఒక ప్రభువుకు దిగువనుండు వారందరు అవశముచే రాజ్య ప్రజలలో కొందరికి హాని మొదలగు కార్యములు చేసినప్పటికి దానికి శెట్టింపుతిరిగి అనేక యుక్తకార్యములుచేశి ప్రభువుకు ప్రజాద్రవ్య నష్టములు లేకుండ వృద్ధిచేశినయడల యెట్లు సంతోషించునో అట్లేఅవశముచేతాముచేయు హింశలకు ప్రాయశ్చిత్తరూపమైన సత్కర్మలవలన ఈశ్వరానుగ్రహము కలుగుననుటకు సందేహములేదు. దేహప్రాణరక్షణార్థ

మున్నూ, ద్రవ్యధాన్య రక్షణార్థమున్నూ చేయబడు హింసలు దీనా నాథరక్షణాదులచే పోగొట్టుకొనవలెను. గృహనిర్మాణాదుల వలన కలుగు జీవహింసా దోషమును వాస్తుపూజాదులచేతను బలి భోజనాదులచేతను పోగొట్టుకొనవలెను. ధాన్యాది ఆహారపదార్థము లుత్పత్తి జేయుటకు భూమినిదున్నుటకున్నూ బండ్లు లాగుటకున్నూ వుపయోగించు అరోగ దృఢగాత్రములగు వృషభాదులను స్నానాదులు చేయించిన్ని తగిన ఆహారాదికమిచ్చిన్ని వాటిని హింసించిన దోషము తొలగుటకు, "పారాశరస్మృతి శ్లో॥ జప్యందేవార్చనం హోమం స్వాధ్యాయమ్చైవ మభ్యసేత్ । ఏక, ద్వి,త్రి చతుర్విప్రాన్ భోజయేత్ స్నాతకాన్ ద్విజః॥ అను ప్రకారము జపముదేవ పూజ మొదలగు చేసి కార్యగౌరవము ననుసరించి వకరు, యిద్దరు ముగ్గురు గాని నల్గురు స్నాతకులయిన బ్రాహ్మణులను భుజింపజేసిగాని అందుకు తగనివారు ద్రవ్యమిచ్చిగాని తృప్తినందించవలెను. యజ్ఞార్థము ద్రవ్యము కోరువాడును యజ్ఞాదులయందు ద్రవ్య వినియోగముచేసి దరిద్రుడైనవాడును వంశవృద్ధి కొరకు వివాహార్థము యాచించువాడును, తెరువరియు, మొదలయిన వారు స్నాతకులన బడుదురు. వ్యవసాయము చేయుటలో చెట్లు నరకుటలోను భూమిని దున్నుటలోను సంభవించు అనేక జీవ హింసాదోషములను తొలగుటకు "పారాశరస్మృతి శ్లో॥ వృక్షాంఛిత్వా మహీంభిత్వా హత్వాతుక్రిమికీటకాన్ । కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే॥ పండించిన ధాన్యాదులుండు కళ్ళములోనికి వచ్చిన బ్రాహ్మణాదులకు ధాన్యాదులు దానముచేసి అట్టిదోషమును పోగొట్టుకొనవలెను. ఒకవేళ అట్లు జరిగించనివారలు శ్లో॥ యోనదద్యాద్ద్విజాతిభ్యో రాశి మూల ముపాగతః। సచోరస్సచపాపిష్ఠో బ్రహ్మఘ్నంత వినిర్దిశేత్॥ అను ప్రకారము పంటకళ్లములోనికి వచ్చిన వారికి పెట్టకుండ ధాన్యాదులు యింటికి చేర్చువాడు చోరుడు పాపిష్ఠుడు బ్రహ్మహంతకుడున్నూ, అగును. యింకను కర్మేంద్రియములచే చేయబడు

పాపములకున్నూ, ధాన్యాదులు ఆహారముగా నుపయోగించుటలోను మొదలైన వాటివలన నిత్యము సంభవించు దోషములకు ప్రాయశ్చిత్తము లేవనగా శ్లో॥ సంధ్యాస్నానం జపోహోమో దేవతానాంచ పూజనం, ఆతిధ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినేదినే॥ నిత్యషట్కర్మలలో మొదటిదగు సంధ్యావందనములో ఆపోహిష్ఠాది బ్రాహ్మీస్నానానంతరం ప్రాతఃకాలమందు 'సూర్యశ్చ' అను మంత్రము చేతను అభిమంత్రించుట యనగా సూర్యుడును క్రోధాభిమాని దేవతయున్నూ క్రోధనియామకులగు దేవతలును క్రోధావేశముచే చెయ్యబడిన పాపములనుంచి నన్ను రక్షించెదరు గాక గతరాత్రియందు మనస్సుచేతను వాక్కు చేతను, చేతుల చేతను, పాదముల చేతను ఉదరము చేతను గుహ్యాంగము చేతను శాస్త్రనియమములతో నాచరించు కర్మలలో సగా ప్రమాదముచే నావలన దొర్లిన యే కొద్ది పాపము గలదో దానిని రాత్ర్యభిమానిదేవత నాశనమొనర్చు గాక యీ విధమైన పాపములను నాయందు అంతర్గతుడై యుండు నాశరహితమయిన సూర్యతేజస్సునందు వేల్చుచున్నవాడను. యిట్టి తలంపుతో మంత్రపూతముగా నేనొనర్చు యీజలపానము సుహుతమగు గాక అని ప్రాయశ్చిత్తరూపముగా పాపపరిహారమును ప్రాతర్మధ్యాహ్న సాయంకాలముల యందు కొంచెము అర్థభేదముతోనుండు మంత్రపూతమయిన జలపానము చేసుకొనుచున్నారు. ఆ పిమ్మట దోసెటిలోనుండి అర్ఘ్యోదకములు, గాయత్రిచే అభిమంత్రించి గోశృంగమాత్రమెత్తి ప్రక్షేపణం చెయ్యగా అవి వజ్రీభూతములై రవిమార్గనిరోధకులగు మందేహనిశాటులను హింసించును. అట్టి హింసాదోషము తొలగుటకు ప్రాయశ్చిత్తమైన ఉద్యంతము అను మంత్రముచే అభిమంత్రించిన ఉదకమునుతనకు చుట్టును ప్రదక్షిణముగా చల్లుకొనబడు చున్నది.

• అనంతరం శ్రు॥ అసావాదిత్యో బ్రహ్మ అను ప్రకారం ఈసూర్యుడే బ్రహ్మముగా నెంచి గాయత్రి జపము చెయ్యబడు చున్నది "గాయం

తంత్రాయతెయస్మాద్గాయత్రి తేన కథ్యతే” అను ప్రకారంగానముచేయు వారిని సంసార భయమునుండి రక్షించునదిగనుక గాయత్రియనబడు చున్నది. జపము అనగా జకారము జన్మనాశనము పకారము పాపనాశ నమును సూచించును. పాపనాశన పూర్వకముగా జన్మ రాహిత్యము కలుగు నట్టిదిగ నున్నది. అట్టి సూర్యు నుద్దేశించిన్ని సూర్యాధి దేవత యగు అగ్నిప్రీతి కొరకున్ను స్మార్తాగ్నియందు యవలుగాని తండుల ములుగాని గోధుములుగాని హోమము చేయుటచే బీజాది హింసచే వచ్చు పాపముకు అనాజ్ఞాతాది మంత్ర పఠనము చేయబడు చున్నది. తర్వాత దేవతా పూజయనగా శ్లో॥ ఈశే విష్ణుర్భాస్కరో వహ్నిదేశె సౌమ్యే శక్తి ర్దక్షిణే విఘ్నరాజః। మధ్యేశంభుర్ముఖ్యతః పూజనీయో పంచాంగోయం పూజితో యంచిదాత్మా॥ ఈశాన్యదిక్కునందు విష్ణు వున్ను, ఆగ్నేయమందు సూర్యుడున్ను, ఉత్తరమందు శక్తియున్ను' దక్షిణమందు విఘ్నరాజున్ను మధ్య, శివునిన్ని, ఉంచి నిత్యము పూజిం చవలెను. యెందుచేతననగా చిదాత్మయె అయిదు అంగములుగా పూజించబడు చున్నది. ఈపంచదేవతలలో యెవరికి యేదేవునియందు అధికభక్తికలదో ఆదేవునిమధ్య యుంచి యితరదేవతలు అంగదేవతలుగా నుంచి పూజించవచ్చును. లేక వకొక్కదేవతనె యితరదేవతా దూషణ వర్జితముగా పూజించవచ్చును.

అట్లు నిత్యము పూజించ శక్తిలేనివారు ఆదిత్యుని జన్మదినమగు ప్రతి మాఘశుద్ధ సప్తమియందున్ను శ్రీమహాశక్తిని సర్వరాక్షస సంహారపూర్వకముగా విజయముగాంచిన ప్రతి ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు దేవీనవరాత్రములలోగాని తుదకు దేవి జన్మనక్షత్రమగు మూలనక్షత్రమందున్ను శ్రీమహావిష్ణువు యోగనిద్రా సమాప్తియగు ప్రతికార్తీకశుద్ధ యేకాదశియందున్ను శ్రీమహాగణపతి జన్మదినమగు ప్రతి భాద్రపదశుద్ధ చవితియందున్ను శ్రీశివస్వరూపుడగు సూర్యుని తేజాధికమగు నుత్తరాయణములో జన్మమాసమగు మాఘమాస

ములో శ్రీశక్తిస్వరూపుడగు చంద్రునితో యేకరాశియందు సమాగమ మగునట్టి శుభకరమైన ప్రతి మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి యందు శివునిన్ని, ఆయాకాలములయందు ఆరాధించినను ఆయా దేవతారాధకులే యగుదురు. యేమనగా మనకు సంవత్సరముగానుండు కాలము దేవతలకు వక్క రోజుగా నుండును. దేవతానివేదనార్థము మన ముపయోగించు ధాన్యఫలాదులు మనము శ్వేచ్ఛగా పండించుకుని మనలను సర్వవిధముల చోరదుష్టాదులనుండి కాపాడి రక్షించు ప్రభువుకు మనకువచ్చు ఆదాలో ఆరవభాగము కట్నముగా లేక పన్నుగా చెల్లించకుండ అనుభవించినయెడల మనలను ఆగ్రహముతో యెట్లు దండించుటకు యత్నించునో అట్లే ఆయా దేవతానుగ్రహమువలననే సంభవించు భోగాదులను పండించు ధాన్యఫలాదులను ఆయా దేవతలకు విధివిధానముగా సమర్పించకఅనుభవించువాడు దొంగయేయగును అనగా శిక్షార్హుండని భావము. భ. గీ 3 అ 12 శ్లో॥ ఇష్టాన్భోగాన్హివోదేవా దాస్యంతెయజ్ఞ భావితాః। తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవసః॥ అని యున్నదిగనుక ధాన్యఫలాదులు ఆహారముగా తయారుచేయుటలో సంభవించు యిదివరలో వివరించబడియున్న పంచసూనదోష పరిహార ప్రాయశ్చిత్త రూపముగా వైశ్వదేవము చేయుట యనగా ప్రపంచాభివృద్ధిసాధనులగు ఆ యా వివిధదేవతల కొరకు భక్షణయోగ్య సాత్విక ధాన్యాదులచే పచనము చెయ్యబడిన అన్నాదికమును బలులుగానుంచుటయు, అట్లె పంచయజ్ఞములు అనగా దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మయజ్ఞములను బలులనుంచి పవిత్రమైనదిగా సంస్కరించబడిన అన్నాది పదార్థమును సర్వదోష పరిహారముగా దేవతానివేదన చెయ్యబడుచున్నది. ఆ పిమ్మట యమలోక మార్గమందుండు నీలపురంగును బూడిదరంగును గల రెండు కుక్కల కొరకు మార్గమందు రక్షణార్థమున్నా నాల్గుదిక్కుల యందుండు కాకుల నుద్దేశించిన్ని బలులనుంచి వాటిని కుక్కలు, పాపాత్ములు,

చండాలురు కాకులు క్రిముల నిమిత్తమున్నూ త్యాగము చెయ్యబడు చున్నది. అనంతరము అతిథినిరీక్షణములో ఆసమయమునందు నిష్కప టాతిధిగా వచ్చిన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులలో యేజాతివాడైనను నిరసించక వానిని వానిజాతికి తగిన నియమవ్యవస్థతో తృప్తిపరచి తాను భుజించుటలో శాంతచిత్తులగుటకు చిత్రగుప్తాదులకు బలుల నిచ్చియు సర్వభూత తృప్తికొరకు పంచప్రాణాహుతులు జిహ్వాయం దుంచుకొనునట్టి ఆత్మయజ్ఞము చేసియు అన్నాదికము భుజించవలెను. పైనవివరించిన ప్రకారము సాయం సంధ్యావందనానంతరము కూడ వైశ్వదేవాదులు చేసి రాత్రి యియ్యవలసిన నక్తబలిని యియ్య వలెను. మెట్లనగా శ్రుతి॥ ఏభూతాః ప్రచరంతి దివానక్తం బలిమిచ్ఛం తోవితుదస్య ప్రేష్యాః। తేభ్యోబలింపుష్టి కామోహరామి మయి పుష్టింపుష్టి పతిర్దధాతుస్వాహా॥ స్మశానవాసియగు కాలాగ్ని రుద్రునకు భృత్యులైనట్టిన్ని బలులను కోరుచుండి రాత్రింబగళ్ళు సంచరించుచున్నట్టిన్ని యేభూత సముదాయముకలదో అట్టివాటికొరకు నాకు పుష్టి కలుగు నిమిత్తము బలిని యిచ్చుచున్నాను. యిందువలన పుష్టి నిచ్చు అధికారియైన కాలాగ్ని రుద్రుడు నాకు పుష్టి నొసంగుగాక అని దివా రాత్రులు సంచరించు భూతముల నుద్దేశించి బలియుంచ బడుచున్నది. ఆపిమ్మట అతిథ్యాది తృప్తిమూలముగా భుజించుచున్నారు. యిట్లు ప్రతిదినము దివారాత్రులు జర్గించునవి నిత్యకర్మలుగా యున్నవి. నిత్య కర్మలుగాక యితరకాలములయందు చేయునట్టి కొన్ని యజ్ఞాదులున్నూ కలవు. నూతన ధాన్యాదులు అనేక జీవహింసా పూర్వకముగా పండి వచ్చినవగుటచే వాటిని వృథాగా భుజించకూడదు. అందుకు ప్రాయ శ్చిత్తముగా వర్షఋతువులో వచ్చు నూతన ధాన్యాదులకు శ్యామా కాగ్రయణమున్నూ శరదృతువులో వచ్చు నూతన ధాన్యాదులకు వ్రీహి ఆగ్రయణమున్నూ వసంత ఋతువులోవచ్చు నూతన ధాన్యాదు లకు యవాగ్రయణమున్నూ అను యజ్ఞాదులు చేసిన్ని ద్విజాతులు

నూతన ధాన్యాదులు అనుభవించవలెను. పైన వివరించినవన్నియు శూద్రాదులున్నూ వేదమంత్ర రహితముగా చెయ్యవలశియే యున్నది. వివిధమాంసాహారులై మూర్ఖులైన కొండకోయలు నాయకులు మొదల యినవారలు సగా యిప్పటికిన్ని నూతన ధాన్యాగమకాలములయందు యేదో వకరోజున గూడెంలో వారలందరుకలిసి కొత్తలువేయుటయను కార్యము చేయుటలో నూతనధాన్యాదులుపచనము చేసి వారలు ఆరాధిం చే యేకొండదేవతకో నివేదనలేక సమర్పణ చెయ్యనిదే నూతనధాన్యా దులు అనుభవించరు. భూమిమీద ప్రాకెడి అనేక జ్ఞానాజ్ఞానకృత జీవ హింసాదోష నివృత్తికొరకు ప్రాకెడి జంతువులలో అగ్రగణ్యముగానున్న సర్పాదుల నుద్దేశించి శ్రావణపూర్ణిమ మొదలు మార్గశిరపూర్ణిమ వరకు నిత్యము ధానా, సక్తు మొదలయినవాటిచే బలుల నిచ్చు చుండుటయున్నూ సర్ప బల్యుత్సర్జనమున్నూ జరిగించెదరు. అట్లు జరి గించలేని సామాన్యులందరు ప్రతి కార్తీక శుద్ధమందు నాగుల జన్మ దినమందుగాని శ్రీసుబ్రహ్మణ్య జన్మదినమగు ప్రతి మార్గశిర శుద్ధ షష్ఠియందుగాని సర్పబలి ప్రత్యామ్నాయము సర్పపూజ జరిగించబడు చున్నది. ప్రతి మార్గశిరపూర్ణిమయందు శ్వానబలి ప్రత్యామ్నాయము కుక్కలకు కుడుములు వెయ్యబడుచున్నది. మరియు పైదోషాదుల న్యూనతారతమ్య ప్రాయశ్చిత్త సర్వభూత తృప్తికొరకు శ్రుతి॥ "ఈశాన స్సర్వవిద్యానా మీశ్వరస్సర్వభూతానాం" అను ప్రకారము సర్వభూ తాధిపతియగు ఈశానునిగురించి హోమాదులున్ను ఈశానబలిన్ని యియ్యబడుచున్నది. ఈ మొదలయిన సూక్ష్మాతి సూక్ష్మములగు దోషములకు సగా ప్రాయశ్చిత్తాదులు చేసుకొనుచుండునట్టి ఒకానొక సమర్థుడైన ద్విజుడు మాత్రమేచేయు అనేకవిధములయిన యజ్ఞాదులలో పశువధారూపమయిన శ్రుతి॥ యదగ్నిషో మీయం పశుమాలభతే వార్త్రఘ్న ఏ వాస్య సతస్మాద్వాస్యం । అస్యార్థః । అగ్నిషోమీయం అగ్నిషో మదైవత్యంపశుం ఆలభతేహంతీతియాత్ తత్ అస్యయజమానస్య

వార్త్రఘ్నః పాపహారీతస్మాత్ తస్మాత్కారణా దేవానస్యం భక్ష ణార్హం అగ్నిషోమీయ పశ్విడామాంసభక్షణీ యమితి యాజుషశ్రుతి॥ అనగా అగ్నిషోమీయ పశ్వనుజంపుట యజమానుని పాపము జంపుట గావున అగ్నిషోమీయపశ్విడామాంసము అవస్యము భక్షణీయ ముగా నున్నది. అట్టి యజ్ఞాదులు చేసిన్ని తిరిగి వాటిలో సంభవించు జ్ఞానాజ్ఞాన కృతములగు దోషములకు ప్రాయశ్చిత్తార్థముగా దక్షిణ సహితాన్నదానాదులు చేయుచున్నారు. శ్లో॥ అన్నహీనోదహేద్రాష్ట్రం మంత్రహీనం తథర్త్విజం ఆత్మానం దక్షిణాహీనః నాస్తియజ్ఞ సమోరిపుః॥ అను మత్స్యపురాణోక్త వచనము ప్రకారము మంత్రద్రవ్యాద్య శక్తులు పిష్టపశుయజ్ఞము చేస్యు నిర్ణయించుకొనిన మాత్రము చేతను పై విషయములలో సమర్థులయినవారలు కొందరు మాత్రమే యజ్ఞాదుల యందు చేయు పశువధ దోషమనుట భావ్యముకాదు. సనాతనులు మరణ పర్యంతము తాముజేయు హింసాపూర్వక జీవనవిధిలోనివియగు అనేక దోషములకు ప్రాయశ్చిత్తరూపములగు అనేకవిధములయిన యజ్ఞాదు లలో యథాశక్తిగా యేకొన్నియైనను చేయుచు భ - గీ 4 అ 31 శ్లో॥ యజ్ఞశిష్టామృత భుజోయాంతి బ్రహ్మ సనాతనం। నాయం లోకో స్త్య యజ్ఞస్యకుతోన్యః కురుసత్తమ॥ యజ్ఞశేషమగు పదార్థము అమృతమును భుజించుచుండుటచే క్రమక్రమముగా పవిత్రవంతులై సనాతనమైన బ్రహ్మపదము నొందుదురు. అట్టివాటిలో యేవిన్ని జేయని వారికి ఈలోకమే లేదు. అట్టివానికి పరలోక మెక్కడిది? యజ్ఞాదులు చేయుట స్వర్గమునందు ఊర్వశి రంభాదుల సంభోగార్థమే నని పరిహ సించుట భావ్యముకాదు. యజ్ఞములు చేశినవారందరు స్వర్గమునందు ఊర్వశి రంభాదులతో సంభోగించి తీరవలయునని విధిలేదు. స్వర్గముకు వెళ్లినవారిని కామవిరాగ దృఢీకృతబుద్ధి యోగ్యత పరీక్షార్థము రంభా దులు నియమించబడి యుండిరి. అట్టికామ భోగములకు లోబడక దృఢ మనస్కులై యున్నవారలు ఉత్తమ పదవులగు దేవత్వ ఇంద్రత్వాదులు

పొందుదురు. కామలంపటులై అట్టి భోగముల కాసించిన వారలు తిరిగి హీన జన్మలకు పాత్రులగుదురు. యిందుకుదాహరణమేమనగా అరణ్యావాసములోనున్న పాండవులలో అర్జునుడు ఇంద్రలోకముకు వెళ్లినప్పటికిన్ని ఊర్వశిచే భోగార్థము కోరబడిన్ని చిత్త చంచలనములేక నిరాకరించి గౌరవ పాత్రుడాయెను. నూరుయజ్ఞములుచేసి ఇంద్రపదవి సంపాదించుకొనిన నహుషుడు కామేచ్ఛచే పతివ్రతయైన శచీదేవిని మోహించి ఇంద్రపద భ్రష్టుడై అజగరజన్మ పొందెను. గనుక ధర్మవిరుద్ధముగల కామేచ్ఛ ప్రపంచములోనున్ను స్వర్గాదుల యందున్నూ మోఃత నిగ్రహించగలిగిన అంత యోగ్యత కలుగును. భ. గీ. అ 9 శ్లో 20 త్రైవిద్యామాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే॥

అనగా సోమపానముచేశి పాపపరిహారము చేసుకుని పవిత్రులైన వారలు స్వర్గాది భోగములుకనుభవించి 'త్రైగుణ్యవిషయా వేదా' అనునట్టి త్రిగుణమఃలనే బోధించు త్రైవిద్యాను వర్తులు "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అనగా తమపుణ్యము మఃగియుటతోడనే తిరిగిమర్త్యలోకములో జన్మించుచున్నారు. యిట్టికర్మలు చేసి విరామము లేని జన్మలనెత్తుటకంటె కేవల జ్ఞానవంతులై యుండగూడదాయనుట సరికాదు. ఏమనగా భ. గీ 3 అ 4 శ్లో॥ నకర్మణా మనారంభాన్నైష్కర్మ్యం పురుషోశ్నుతె । నచసన్యసనాదేవసిద్ధిం సమధిగచ్ఛతి॥ అనగా కర్మల ననుష్ఠించకపోవుట వలననే పురుషులకు మాన్యతకలుగదు. కర్మలను విడచినమాత్రముననే జ్ఞాననిష్ఠగలుగదు కాబట్టి భ. గీ. 18 అ 5 శ్లో॥ యజ్ఞదానతపఃకర్మనత్యాజ్యంకార్యమేవతత్ । యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం॥ యజ్ఞములు దానములు తపస్సు అనువాటిని వదిలిపెట్టకూడదు. అవిమనుష్యులను పవిత్రులనుగాజేయును. అట్లు పవిత్రులై క్రమక్రమముగా నుత్తమోత్తమ జన్మల నెత్తుచుతుదకు మోక్షము నొందుదురు. యజ్ఞములు, తపస్సును, యిదివరలో వివరించబడెను. యికను దానము అనగా యితరులకు అన్నాది పదార్థముల యిచ్చు

టమై యున్నది. ఆహారముగా నుపయోగించు వ్రీహి, యవాది రూపముగానున్న సాత్వికప్రాణులను బ్రాహ్మణుల కుపయోగించుటచే గాని యితరులచే బ్రాహ్మణులకు యివ్వబడిగాని సద్గతినొందును. కిరాత కులకు హీనజాతులకు అపాత్రులకు ఆహారముగా నుపయోగించబడి గాని యితరులచే నియ్యబడిగాని దుర్గతినందును. ఆప్రాణులు అపాత్రుల కొరకివ్వబడితిమిగదాయనిదుఃఖించును. అందుకు కారకులెవ్వరో ఆహింసా దోషమును అనుభవింతురు గనుక పాత్రతనెరిగి దానము చెయ్యవల యును ఉ. గీ 3 అ 21 శ్లో॥ తస్మాద్బ్రహ్మ విదేదేయం యద్యస్తి వస్తుకించిత్ । కుక్షౌతిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే । సని స్తరతిదాతారం దశపూర్వాన్ దశాపరాన్॥ అనగా బ్రహ్మవిదులైన వారలకు యివ్వబడు అన్నాదిపదార్థములు యిచ్చువారికి తనతో గూడ దశసంఖ్యతో గూడినపూర్వాపరులు తరించుదురు. ఒకవేళ హీనజాతులకు అన్నాదికమివ్వవలసి వచ్చినయెడల వారలచే యేస్వల్పకార్యమునైన చేయించి యివ్వవలశిన విధియైయున్నది. యింకను విశేషముగా చర్చించవలశియున్నను విరమించుటయైనది.

గ్రామదేవతలు, జాతఱలు.

శూద్రాదులు “ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామ సాజనాః ”అను గీతావచన ప్రకారంక్షుద్రశక్తులు మొదలగువాటినిన్ని ప్రాణిలయ కారకములగు కాళి, దుర్గ మొదలగు ఉగ్రశక్తులనున్నా ఆగమశాస్త్రవిధుల ననుసరించి ఆరాధనచేసి వాటివాటికి ప్రీతికరము లగు మధుమాంసాదులు నివేదించి వారలు భుజించుట సనాతనాచార ముగానున్నది. మరియు ప్రతిగ్రామముగానిపట్టణముగానిప్రథమములో నిర్మించు నప్పుడు గ్రామదేవత యను వకశక్తిని ప్రతిష్ఠించి వివిధనామ ములతో పేర్కొనుచు ఆరాధించుచుండుట ఆసేతుహిమాలయపర్యంత ము ఆచరణలో నున్నది. పూర్వము కూడ రావణునిలంకా పట్టణ గ్రామదేవతయగు లంఖిణి యనునది సుందరకాండ తృతీయ్యసర్గ శ్లో॥

30॥ అహంహీనగరీ లంకాస్వయమేవ ప్లవంగమ, సర్వతః పరిరక్షామి హ్యేతత్తేకథితం మయా॥ అనుప్రకారము నేను యీలంకాపట్టణము రక్షించునట్టి కామరూపముగు శక్తినైనాచేత రక్షించబడు చున్నదని చెప్పుచు శ్రీ హనుమంతుని అడ్డగించెను. యిదివరలో చెప్పిన శృతి 'ఏభూతాః' అనువచనాను సారము భూతనాథుడగు కాలాగ్ని రుద్రుని పరివారములగు అసంఖ్యాతములగు శక్తులు పగలురాత్రియు బలి నపేక్షించి తిరుగుచుండును. గరుడపురాణము 21 అధ్యాయములో నుదహరించిన ప్రకారము ప్రాణులప్రాణాపహరణాధి కారముగల యమాజ్ఞా వశవర్తనులై వివిధరోగ రూప బాధకములైన క్రూరశక్తులనేకములు కలవు. అట్టిశక్తులచే 'యమస్య కరుణానాస్తి'అను ప్రకారము విశూచి, మశూచి మొదలయిన రోగరూపబాధకములై ప్రాణులను లయింప జేయుచుండును. అట్టివ్యాధులు ప్రబలిన వెంటనే ప్రజలు ప్రాణభీతిచే గ్రామదేవతా పూర్వకమైన వివిధశక్తులను ఆరాధించివాటిని శాంతింప జేయుటకు జాతరలందు తమప్రాణాపాయ రక్షణార్థము పశ్వాదులను బలియిచ్చుచున్నారు. ప్రాణిసమూహమును పీడించు రాక్షసాంశము గల అనేకపేర్లతో వర్తించుక్రూరశక్తులకు వాటివాటితారతమ్యమునను సరించి ఫలాన్నపశ్వాదులలో వేటినయినను బలిరూపముగా సమర్పించిన అవి తృప్తినంది తొలగిపోవును. తనను కరువవచ్చు కుక్క మొదలగువాటికి అన్నాదిపదార్థములు సమర్పించిన తొలగిపోవును. తమ మీదికివచ్చు వ్యాఘ్రాదులకు మాంసాదులుసమర్పించినతొలగిపోవును. ద్రవ్యార్థముతననుహింసించసిద్ధపడుచోరునికితనవద్దనున్న ద్రవ్యమంతయు యిచ్చివేడుకొనినవాడుసంతసించివెళ్ళును. అదేవిధముగాతమకుమారుగా యివ్వబడిన పశ్వాది బలులచే ఆయాశక్తులుసంతసించి వెళ్ళును. కొంకాయలు మొదలయినవి యిచ్చిన జాలదా జీవహింస యొందుకనిన కొంకాయలు మొదలయినవి ప్రాణిసమూహములోనివె నని యిదివరలో చెప్పియుంటిమి, అయినను వేటివేటిచే యేయేశక్తులు తృప్తినంది సంతసించి

వెళ్ళునని శాస్త్రాధారము కలదో వాటివాటి చేతనే తృప్తినందించ వలెను. యిదివరలో ప్రభుత్వమువారి రక్షణాసైన్యము వచ్చినప్పుడు వారలు కోరిన ప్రకారము బలిసియున్న చూడిఆవులను సమర్పించక తప్పించుకొన గల్గిరా? బలి నపేక్షించు క్రూరశక్తులైనను మనుష్యులు తినునట్లుగా మాంసాదులను అనుభవించుటలేదు. చూచి సంతసించు నవి గాయున్నవి. ఏమనగా తను అధికారియైన యమాజ్ఞ ప్రకారము అనేక జీవులను దుష్ట శరీరములనుండి తొలగించ గలిగితిమి గదాయని సంతసించునవిగా యున్నవి. యిదివరకు ద్విజాతులు చేయు యజ్ఞాదుల యందలి పశువధాదులవలెనే అట్టి జాతరలు మొదలగు వాటియందు బలిరూపముగా సమర్పించబడిన పశ్వాదులకును ఉత్తమ లోక ప్రాప్తి కలుగును. ప్రాణాపాయ రక్షణలో సయితము పశ్వాదులను బలిరూప ముగా హింసించ వచ్చునా ? యనిన తానుగాక యితరులు యెవరు గతించినను అంగీకరించును గాని "తన చావుయుగము గృంగుట" యనునట్లుగా తనచావున కంగీకరించు వారుండరు. 'జంతునాం నర జన్మ దుర్లభ'మను ప్రకారముగా మనుష్యుడుగానున్న తనకంటె పాపాధిక్యముచే తక్కువ దర్జాలోనుండు పశ్వాదులు బలులచే, తనను రక్షించుకొనిన పిమ్మట పుణ్యాపుణ్య విచారణ జ్ఞానముగల మనుష్యుడు జీవకోటికి అనేకవిధముల తృప్తి గలిగించునట్టి పనులను చేయ గలుగును. యుద్ధాదులయందు ప్రభువు తప్ప యితరులు ప్రభువు రక్షణార్థము యెందరు గతించినను వారిజోలితలపెట్టు వారుండరు యేమనగా ప్రభువు జీవించియుండిన యెడల తిరిగి దేశమునకు దేశప్రజలకు అనేక వుపకారరూప పుణ్యము చెయ్యగలుగును. ఏకచక్రపుర వాసులగు బ్రాహ్మణులు బకాసురునిచే స్వేచ్ఛగా చంపబడుచుండి వానివలని బాధసహించలేక వానిని వేడుకుని యింటివరుస ప్రకారము రోజుకుఒక్క యింటిలో ఒక్కమనిషినిన్ని యంకను కొన్ని పశ్వాదులు అన్నాదికమున్ను ఆహారార్థము యిచ్చునట్లు కట్టడి చేసు

కొని ఆప్రకారము నిత్యము జపించుచుండుటచే వారలు జీవహింసాపరులగుదురా? వివక్షత లేక అందరూ చంపబడుటకంటె అట్టి కట్టుబాటు చేసుకొనుట జీవహింస యగునా? వేదవిధి ననుసరించి బ్రాహ్మణాదులుకూడ అట్టి క్షుద్రశక్తులకు ఆరాధన రూపముగా పశ్వాదుల బలి రూపముగా హింసించవచ్చునా యనిన శ్లో॥ దేశభంగే ప్రవాసేవా వ్యాధిషువ్యసనే ష్వపి రక్షేదేవ స్వదేహాని పశ్చాద్ధర్మం సమాచరేత్॥ అను పారాశరవచనానుసారము ప్రాణరక్షణ చేసుకుని పిమ్మట ధర్మమాచరించ గలుగును. అయినను గౌరి, లక్ష్మి, సరస్వతి మొదలగు శాంత శక్తులనారాధించువారలు క్షుద్రశక్తులకుభయపడ నక్కరలేదు. యేమనగా సమస్తశక్తులు వారివారి వారములుగా నుండును. కలకత్తాలో శ్రీ మహా కాళీశక్తికుడిచేతిలో ఖడ్గమున్నూ, ఎడమచేతిలో ఖండించిన మనిషి శిరస్సున్నూ యుండినట్లు ఉగ్రముగా ప్రతిష్ఠించబడియుండి ఇప్పటికిని ప్రతిదినము మాంసనివేదన జరగుచున్నది. గనుక అట్లు పశ్వాదులను బలుల మూలముగా హింసించినను శ్లో॥ తస్యాంయే హ్యుపయుజ్యంతే ప్రాణినో మహిపాదయః। సర్వేతే సద్గతిం యాంతి ఘ్నంతాపాపంనవిందతే। యావన్న చాలయేద్గాత్రం పశుస్తావన్నహన్యతే నతథాంబలిదానేన పుష్పధూపవిలేపనైః॥ అనుప్రకారము బలియియ్యబడు పశ్వాదులుఅన్నిటికిసద్గతిగల్గును. అయినను దానిశరీరమునగుదార్పాటుకొందనిది లేకఘుశతా యివ్వనిది దానిని చంపకూడదు అని నిర్ణయసింధువుచం దున్నది. యజ్ఞాదులయందు సంపూర్ణ దక్షిణాసహిత బ్రాహ్మణ సమారాధన యనుశాంతి జరిగించునట్లే జాతరలందును కుంభము అను అపరిమితాన్నపురాశిని పోశి నివేదించి దీనానాథ జనులకు వినియోగించెదరు. మాంసాహారప్రియులైనశూద్రాదులు సగా దైవపిత్ర్య కార్యములయందే తప్ప యితరకాలములయందు వృథా పశుహింసాపూర్వకమాంసాహారులు కాకూడదు. శ్లో॥ యావంతి పశురోమాణి తావత్కృత్వోహ మారణం వృథా పశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్యజన్మని జన్మని॥ అను ప్రకారము

వృథాగా పశుహింసజేయువారలు వాటిరోమము లెన్నియుండునో అన్ని పశుజన్మలు మెత్తితిరిగి అదేవిధముగా మరణించుచుందురు. అట్లు మరణించుటలో కొంత సుకృతవిశేషముచే దేవ పితృ కార్యములకు మరణము సంభవించేనేని సద్గతి కలుగును. యుద్ధాములయందు ప్రభుప్రరక్షణార్థము గతించు అనేక నరాశ్వగజాదులను గురించి యెట్లు తలపెట్టు వారుండరో అట్లే హింసాజీవనవిధియగు ఈ ప్రపంచయుద్ధములో ఆత్మరక్షణార్థము విధితప్పక చేయు హింసాములను గురించి బ్రహ్మజ్ఞానుల వలె నటించి తర్కించుట ఆలోచనాంశముకాదు. కలరా మొదలగు వ్యాధి నివారణకొరకు వాటికి సంబంధించిన క్రిములను చంపుటకు నూతులు జాలాశయములు మొదలగు వాటిలో మందులు కలుపుట కూడదనువారుందురా? ప్రసముకాలేని గర్భిణి స్త్రీవిషయములో మాతృరక్షణార్థము గర్భస్థశిశుచ్ఛేదము నంగీకరించకుందురా? శ్లో॥ అగ్నిదోగరద శ్చైవ, శస్త్రపాణిర్థ నాపహా। క్షేత్రదారాపహర్తాచషడేతే హ్యాతతాయినః॥ అనగా నిప్పంటించుటకున్నూ విషము పెట్టుటకున్నూ ఆయుధహస్తుడై నరకవచ్చుటకున్నూ ద్రవ్యమును భూమిని భార్యను అపహరించుటకున్నూ సిద్ధపడు వీరలార్గురున్నూ ఆతతాయులన బడుదురనిన ఆపస్తంబవచనాను సారము యిట్టి వీరలను దండించుట రాజులకు విధియైనప్పటికి హఠాత్తుగా అట్టిపనులకు సిద్ధపడువారిని యెట్టి దయామయుడైనను తన శక్తికొలది అట్టివారికి తగిన హింసగాని వధగాని చెయ్యకుండునా? గనుక అవశముగానున్నప్పుడు అధిక దోషములను వదలిస్వల్పదోషములను చేయుచు అట్టి స్వల్పదోషములు గల వాటికిన్ని యథాశక్తి ప్రాయశ్చిత్తాదులు చేసికొనుచు జీవయాత్రగడుపుకొనుటవిధియైయున్నది. రాజులున్నూ రాజాజ్ఞావర్తులున్నూ గోబ్రాహ్మణ రక్షార్థము మృగములను వేటాడుటవలన దోషములేదు. శ్లో॥ క్షత్రియాణాంచ యోదృష్టోవిధిస్త్వమపి మేశృణు। వీర్యేణోపార్జితం మాంసం యథాభుంజన్ నదూష్యతి। అరణ్యాస్సర్వదైవత్యాః ప్రోక్షితా

స్తు పసామృగాః । అగస్త్యేన పురారాజన్ మృగయాయేన పూజ్యతే ।
నాత్మాన మపరిత్యజ్య మృగయానాను విద్యతే। సమతాముప సంగమ్య
భూతంహన్యతిహంతివా । అతోరాజర్షయ స్సర్వేమృగయాం యాంతి
భారత । నహిలిప్యంతి పాపేన న చైతత్పాతకం విదు॥ రితి శ్రీమహా
భారతే యనుశాసనిక పర్వణ్యు క్తం. రాజులు తమశక్తివలనసంపాదించ
బడిన మాంసభక్షణవలన దూషించబడరు. సర్వదైవత్యములగు అరణ్య
మృగములను అగస్త్యులవారిచే ప్రోక్షించబడెను. వారిచే వేట ప్రసిద్ధి
కెక్కెను. తనను విడిచి వేట యనునది లేదు. తాను వాటిని చంపను
వచ్చును. అవి తననున్నా చంపవచ్చును. అందువలన రాజర్షులందరు
వేటాడుదురు. అందువలన పాపము నొందరు గనుకనే హరిశ్చంద్రాదు
లున్నా పూర్వము వేటాడియుండిరి. కుక్కలు మొదలగు వాటిచే
వేటాడించినను దోషములేదు. ప్రత్యక్ష వధకంటె గొర్రెలు మేకలు
కోడిపుంజులు మొదలగు అన్యోన్యకలహముచే మరణించినవాటినిభక్షిం
చిన శూద్రాదులకు దోషములేదు. పుచ్చిన ధాన్యాదులను నల్లులు
మొదలగువాటినిన్ని పోగొట్టుటకు యెండలోవేయుటచే దోషములేదు.
దోమలు ఈగలు మొదలైన వాటినిగురించి ధూపద్రవ్యము లుపయో
గించిన దోషములేదు. దేవమందిరములవద్దను దేవతా ప్రీతికొరకున్నా
వుంచబడు దీపములలో మరణించు క్రిమిహత్యాదోషము కర్తకు జెందదు.
సర్వజనోపయోగమయిన కోనేళ్ళు తటాకములు మొదలగువాటిలో
పడి మరణించువారి హత్యాదోషము కర్తకు జెందదు. యిట్లు యింకను
స్మార్తశ్రౌతి సూక్ష్మములుగ్రహించుకొనవలెను. యింతవరకు వివరించిన
వన్నియు హింసాదులున్నా వాటికి ప్రాయశ్చిత్తాదులున్నా అయి
వున్నవి.

యికను అహింసయేదనగా నిర్నిమిత్తముగా యెట్టిప్రాణికిని
హింసగాని వధగాని చెయ్యకుండుటయు విధితప్పని నిమిత్తము గలిగి
నప్పుడైనను సాధ్యమయినంతవరకు హింసగాని వధగాని చెయ్యక

తప్పించుకొనుచున్నా అట్లు చేయువాటిలోకూడ అధిక దోషములం గలవాటిని వదలి స్వల్పదోషములుగలవి చేయుచున్నా అట్టి స్వల్ప దోషములకు సగాయిదివరలో ఆయా సందర్భములలో శ్రుతిస్మృత్యా దులలోనుంచి వివరించిన ప్రకారము యథాసంభవముగా ప్రాయశ్చిత్తా దులు చేసికొనుచు కాలము గడపువా రందరున్నా అహింసాపరులై యగుదురు.

నిత్యమువారు చేయు జీవహింసలు యేవియోవాటికి ప్రాయ శ్చిత్తములు చేసికొనుట యెట్టిదోజీవితకాలములోనే యెరుగని వారం దరు మిక్కిలి దోషయుక్తమయిన హింసాపరులెయగుదురు. ఈప్రపంచ ములో నూటికి 99 గురు జీవహింసాపరులున్నా వృథా మాంసాహారు లున్నాగానున్నారు. ఇట్టిస్థితిలో జీవహింస చెయ్యకుండ ప్రచారము చేయుటతో తృప్తినొందక ప్రభుత్వమువారిచే శాసనములుకూడా చేయించసిద్ధపడుట అవివేక మూలము.

అనేకవిధములయిన జీవహింసాపరులైన సంగతి తాము గుర్తించ లేకయుండిన్ని సూక్ష్మాతిసూక్ష్మములైన హింసలు సగా కనిపెట్టి అట్టి వాటికి యథాశక్తిగా ప్రాయశ్చిత్తాదులు చేసికొనుచు జీవయాత్రగడపు చుండు అహింసాపరులైన సనాతనులకు అహింసావిషయము బోధించుట యెట్లున్నదనగా ప్రసిద్ధవ్యభిచారస్త్రీ కుల స్త్రీకి పాతివ్రత్యముబోధ చేయ సిద్ధపడినట్లుండును.

ఉ॥ గీ 2 అ. 51 శ్లో॥ యథాఖరశ్చందన భారవాహో భారస్యవాహోనతు చందనస్య ఏవంహి శాస్త్రాణి బహూన్యధీత్యసారం నజానన్ ఖరవద్వహేత్సః॥ చందనపు కట్టెలను మోయుచున్న గాడిదె అందన గంధమును తెలుసుకొనని విధముగ, అనేకములయిన శాస్త్ర ములు చదివిన్ని వాటిసారమును గ్రహించ లేనివాడు గాడిదతో సమాను డనియున్నది.

శ్లో॥ పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః। త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల। అన్యధాశరణంనాస్తిత్వమేవశరణం మమ।తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష సదాశివ।

శ్లో॥ స్వస్తిప్రజాభ్యః పరిపాల యంతాంన్యాయేన మార్గేణ మహీం మహీశాః గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినోభవంతు॥

సనాతనధర్మ నిర్ణయ రూపమైన స్వప్రశ్యా

స్వప్రశ్య వివేకము అను గ్రంథము

సర్వము సంపూర్ణము.

ఓం తత్సత్ బ్రహ్మార్పణ మస్తు.